*Photo by:* **MIKE BROWN**



IN A PRIVATE SANCTUARY IN AUSTRALIA

# పాలన పోషణ సరిగా చెయ్యండి
# పిల్లలకు బోర్న్‌విటా ఇవ్వండి!



## చదువులలో సర్వశ్రేష్ఠత ...
## ఆటలలో అగ్రగణ్యత

చదువుల్లో ఆటల్లో హరింపు అయే శక్తిని పిల్లలకు తిరిగి సమకూర్చక పోతే వారి మానసిక శారీరక వికాసానికి ఆటంకం కలుగుతుంది. ప్రతి దినం వారు బోర్న్‌విటా త్రాగటం వలన పిల్లల శక్తి పెరుగుతూ ఉంటుంది. పుష్టికరమైన కోకో, పాలు, మాల్ట్ మరియు పంచదారలతో తయారైన బోర్న్‌విటా రుచికరమైనది.




**శక్తి, ఉత్సాహం మరియు రుచికోసం క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా!**

OBM 0448 TEL

మధుర మయిన సంగీతానికి
రూప కల్పన స్వర కల్పన
పెండ్యాల














అనుపమ చిత్రం

విఖ్యాత
దర్శకుడు
తిలక్

# భూమికోసం

ఈస్ట్‌మన్ కలర్

ARTICU

# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ [''తెర రహస్యం''] భైరి సత్యనారాయణ రచన. ఈ సంచికతో ''మహాభారతం'' ముగుస్తున్నది. పై నెల నుంచి ''వీర హనుమాన్'' అనే పేరుతో హనుమంతుడి విచిత్రకథ ప్రారంభం కాబోతున్నది. పురాణ ప్రసిద్ధిగల పాత్రలలో హనుమంతుడు ప్రత్యేకత గలవాడు. అతని ప్రవర్తనలో ఎక్కడా వంక అన్నది లేదు. అతని శక్తి సామర్థ్యాలు అద్భుతమైనవి. అతనికి ఓటమి అన్నది లేదు.

సంపుటి 55 సెప్టెంబర్ '74 సంచిక 3





# మిత్రభేదం

## 15

దమనకం చెప్పిన కుకుద్రుమం కథ విని పింగళకం, "సంజీవకం ద్రోహం తలపెట్టినట్టు నాకు రుజు వెలా లభిస్తుంది?" అని అడిగింది.

"అతను కొమ్ములు ముందుకు చాచి ఏలినవారి వద్దకు వచ్చినట్టయితే పొడవటానికి వస్తున్నట్టు తమరు గ్రహించవచ్చు." అన్నది దమనకం.

అది సింహం వద్ద సెలవు పుచ్చుకుని, విచారంతో కుంగిపోతున్నట్టు నటిస్తూ సంజీవకం వద్దకు వెళ్ళింది.

"ఏం, బాబూ? ఎందుకు విచారంగా ఉన్నావు?" అని సంజీవకం అడిగింది.

"రాజును ఆశ్రయించిన తరవాత విచారం కాక మరేమిటి? ఎల్లప్పుడూ తన ప్రాణం గురించీ, తన మిత్రుల ప్రాణం గురించీ రాజసేవకుడికి భయమే గద! పేదవాడూ, రోగీ, దేశబహిష్కృతుడూ, మూఢుడూ, రాజసేవకుడూ జీవచ్ఛవాలు. వారికి స్వేచ్ఛ లేదు. కుక్కలకైనా ఉన్నది గాని, వారికి లేదు. రాజసేవకుడు యతి లాగా జీవించాలి. ఎందుకు? పాపపంకిలంలో పొర్లటానికి! మిత్రమా, నువ్వింకా ఈ సంగతి గ్రహించినట్టు లేవు." అన్నది దమనకం.

"రాజుకు సన్నిహితుడుగా ఉండటం చేత నాకు ప్రాణాపాయం ఉన్నదంటావా?" అని సంజీవకం అడిగింది.

"అదే నా అభిప్రాయం. మిత్రుడివి గనక, ఏమైనా సరే, ఉన్నమాట అనేస్తాను. మన యజమాని పింగళకం ఎందుకో నీ మీద అలిగాడు. 'సంజీవకాన్ని చంపి, అందరికీ విందుచేస్తాను,' అని ఆయన ఇవాళ నాతో అన్నాడు. ఇది విని

అట్ట చివరి బొమ్మ

నేను కుంగి పోయానని వేరే చెప్పాలా? ఈ క్లిష్టపరిస్థితిని ఎదుర్కొనటానికి నువు సిద్ధంగా ఉండాలి,'' అన్నది దమనకం.

ఈ మాట విని సంజీవకానికి పిడుగు పడినట్టు అనిపించింది.

''అయ్యో, నాకీ దుర్గతి ఎలా దాపరించింది? రాజును విశ్వాసంతో సేవించినందుకు ఫలితం చావా? శత్రుత్వానికి కారణం తెలిస్తే చక్కబెట్ట గలను, కాని అకారణ వైరాన్ని ఎలా సరిచెయ్యటం? నేను పింగళకానికి ఏం ద్రోహం చేశాను?'' అన్నది సంజీవకం.

''మిత్రమా, రాజుల బుద్ధే అలాటిది. మరీ బలవంతులని తోచిన వారి మీద దెబ్బ తీస్తారు,'' అన్నది దమనకం.

''నిజమే, నిజమే. తప్పు నాదే. ఆకులూ అలములూ తినే నాబోటివాడు కేవల మాంసాహారి అయిన సింహంతో ఎన్నడూ స్నేహం చేసి ఉండరాదు. వెనకటికి హంస లాగా, సమానులు కాని వారితో స్నేహం చేసిన వాళ్ళు నశించి పోతారు,'' అంటూ సంజీవకం హంస కథ ఇలా చెప్పింది:

హంస – గుడ్లగూబ కథ

ఒకానొక అరణ్యంలో ఒక సరస్సు ఉండేది. అందులో ఒక హంస ఒంటరిగా ఉంటూ, నీటిలో ఈదుతూ, ఆహారం తింటూ హాయిగా కాలక్షేపం చేసేది.

ఒకనాడు ఆ ప్రాంతానికి ఒక గుడ్లగూబ వచ్చింది.



"నువు ఎక్కడి దానివి? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని హంస గుడ్లగూబను అడిగింది.

దానికి గుడ్లగూబ, "నేను ఇలాటి మరొక సరస్సు పక్కన ఉన్న తామరల తోపులో ఉంటాను. నీ స్నేహం చేసి పాపాలన్నీ పోగొట్టు కుందామని వచ్చాను," అన్నది.

హంస ఈ మాటలకు ఉబ్బిపోయి, "నీ యిష్టం వచ్చినంత కాలం ఉండు," అన్నది. గుడ్లగూబ అలాగే చేసింది.

రెండూ కలిసి చాలా రోజులు సుఖంగా గడిపిన మీదట, గుడ్లగూబ తన చోటికి వెళ్ళిపోతూ, "నీకు నాపై స్నేహభావం ఉంటే, నా చోటికి వచ్చి, నా అతిథిగా ఉండాలి,". అన్నది.

హంస ఒక ఉదయం తామరల తోపుకు వెళ్ళింది. కాని, గుడ్లగూబ ఒక కొండ గుహలో నిద్రపోతూ కనిపించింది.

"నీ మిత్రుడైన హంసను, నిన్ను చూడ వచ్చాను," అన్నది హంస.

"నాకు పగలు కళ్ళు కనిపించవు. చీకటి పడినప్పుడు కలుసుకుందాం," అన్నది గుడ్లగూబ.

హంస చీకటిపడే దాకా వేచి ఉన్నది. అప్పుడు గుడ్లగూబ బయటికి వచ్చి, హంసను కుశలం అడిగింది. తరవాత హంస గుహ బయట నిద్రపోయింది.

ఒక బిడారు ఆ రాత్రి సరస్సు పక్కన మజిలీ చేసింది. తెల్లవారు ఝామున బిడారు వాళ్ళు ప్రయాణ సన్నాహాలు ప్రారంభించి, శంఖం ఊదారు.

ఆ ధ్వని విని గుడ్లగూబ ఉలిక్కిపడి, గట్టిగా అరిచి, చప్పున గుహలోకి పోయింది. హంస మాత్రం గుహ వెలపలనే ఉండిపోయింది.

ప్రయాణ సమయంలో గుడ్లగూబ అరవటం దుశ్శకునమని బిడారునాయకుడు ధ్వనిని బట్టి గుర్తిచూసి ఆ పాడు గుడ్లగూబను కొట్టమన్నాడు. విలుకాడు అలాగే చేసేసరికి ఆ బాణం హంసకు తగిలి, అది కాస్తా చచ్చింది.





# విచిత్ర కవలలు

## 3

[దానశీలమహారాజు ఒకనాడు తోటలో షికారు చేస్తూండగా, ఒక బండరాయి కనిపించింది. ఆయన దానిని పక్కకు నెట్టి చూడగా, దిగువున భూగృహం వున్నది. రాజు తన ముగ్గురు కుమార్తెలనూ, నౌకర్ల సంరక్షణలో ఆ భూగృహంలో వుంచి, దుఃఖిస్తూ తన భవనానికి బయలుదేరాడు. ఇది చూసిన రాణి భయంతో మూర్ఛపోయింది. తరవాత—]

రాజభవనంలోని పరిచారకులూ, దాసదాసీలూ రాజును ఓదారుస్తూ, రాణికి ఉపచారాలు చేయసాగారు. కొంతసేపటి వరకూ అక్కడ చేరిన వారిలో ఎవరి ముఖానా కళాకాంతీ లేదు. ఈ లోగా ఆస్థానవైద్యుడు వచ్చి రాణికి ఒక ఔషధం యిచ్చాడు. మరి కొంతసేపటికల్లా రాణికి స్పృహ వచ్చింది. అప్పుడు రాజుకు కాస్తంత స్థిమితం చిక్కింది. తరవాత ఆస్థానవైద్యుడు, రాజును అడిగే సరికి ఆయన యిలా చెప్పసాగాడు:

"నేను అలవాటు చొప్పున దాసీలతో సహా పిల్లలను వెంట తీసుకొని మన తోటలో షికారుకు పోయాను. ఈ నాలుగేళ్ళలోనూ అమ్మాయిలు ఎన్నో గండాలు గడిచి బ్రతకటం కళ్ళారా చూసిన వాడినే కనుక, ఎప్పటికప్పుడు ఎంతో జాగ్రత్తతో వుండటం అవసరమైంది. అందుకని,



యింకా ఏమో చెప్పబోతూండగా రాణి, 'హాఁ' అంటూ విరుచుకు పడిపోయింది.

పరిచారికలు రాణీకి ఉపచారాలు చెయ్యసాగారు. కొంతసేపటికి రాణీకి స్పృహ వచ్చింది. అప్పుడు రాజు తిరిగి యిలా చెప్పుకు పోయాడు: "ఇదంతా ఒక్క లిప్తలో జరిగిందంటే నమ్మండి. అప్పటికీ గబ గబ ఆ రాబందులు ఎగిరి పోయిన దిక్కుకు నేనూ, వందమంది నౌకర్లూ, దాసీలూ కూడా పరుగెత్తాము. నడక అలవాటు లేని నేను వెనకపడ్డాను. కాని, నా పరిజనము మాత్రం, శర వేగంతో ఆ రాబందులు వెళ్ళిన దిక్కుగా వెంబడించారు. ఐతే, మరి కొంచెం సేపటికే రాబందులు కంటికి కనిపించ కుండా మాయమైపోవటంతో, నిరాశ చెంది పరివారమంతా మళ్ళుముఖం పట్టారు. ఇది చూసి నాకు మరి ముందుకు అడుగు పడక ఆగిపోయాను.

పిల్లలు ఇల్లు వదలి బైటికి కదిలినప్పు డల్లా, వాళ్ళ వెంటనే నేనూ, ఒక వంద మంది సేవకులను వెంటబెట్టుకుని వుండ వలసి వస్తున్నది. అలాగే ఇవాళ కూడా తోటలో చుట్టూ వందమంది సేవకులను కాపలా వుంచి, వాళ్ళ మధ్య నేనూ, దాసీలూ, అమ్మాయిలను వెయ్యికళ్ళతో కనిపెడుతూనే వున్నాం. ఇంతలో ఒక పెద్ద సుడిగాలి వచ్చింది. ఆ సుడిగాలికి బ్రహ్మండమైన దుమ్మురేగి, మేము ఒక్క క్షణం కన్నుమూశాము. తిరిగి కన్ను తెరిచేంతలో, మూడు రాబందులు వచ్చి నా చిట్టితల్లులు ముగ్గురినీ ఎత్తుకు పోవటం కనిపించింది," అని రాజు

"ఆ సమయంలో మరొక గొప్ప చిత్రం జరిగింది. తిరిగివస్తూన్న నా పరి వారం—వంద మంది సేవకులూ, ముగ్గురు దాసీలూ — నేను చూస్తూవుండగానే కొంత దూరం వచ్చి వచ్చి, ఒక్కసారి పక్షులుగా మారి, ఆ రాబందులు పోయిన దిక్కుగానే వాళ్ళూ ఎగిరిపోయారు. ఇదంతా కళ్ళబడటంతో నా మనస్సు

వికలమై పోయింది. ఇంకెన్ని కష్టాలు అనుభవించాలో, దేవుడు నన్నింకా యీ లోకంలో ఎందుకు అట్టేపెట్టాడో అని పించింది,'' అని రాజు దుఃఖించసాగాడు.

ఈ లోగా యీ వార్తలు చెవినిపడిన జ్యోతిష్కుడు కూడా అక్కడకు రావటం జరిగింది. జ్యోతిష్కుణ్ణి చూస్తూనే రాణి ఆయన పాదాలపైన పడి, ''మీరు ఆ నాడు అంత చెప్పినా కూడా పిల్లల్ని రక్షించుకోలేక పోయాం. నా చిట్టితల్లులు నా ఎదట లేకపోతేపోయారు. దాపరికం లేకుండా ఒక్క సంగతి చెప్పండి. కనీసం వాళ్ళు ప్రాణాలతో నైనా వున్నారో లేదో తెలుసుకుంటే కాని నేను బతకను,'' అంటూ భోరున ఏడ్చింది.

జ్యోతిష్కుడు మళ్ళీ ఒకసారి పిల్లల జాతకం తెప్పించి, నిదానంగా పరిశీలించి చూసి యిలా చెప్పాడు: ''అమ్మా, జాతకరీత్యా పిల్లలకు యీ ఏడు, ఏ విధ మైన గండమూ కనపడదే! మరి, యిది ఎలా జరిగిందో నాకే బోధపడటంలేదు. పిల్లలు ఎక్కడ వున్నారో మాత్రం యీ పళంగా చెప్పలేను గాని, వున్నచోట మాత్రం వారు ముగ్గురూ క్షేమంగానే వున్నారు. అమ్మాయిలే కాదు, వారి వెంట అండగా వెళ్ళిన వందమంది పరి చారకులూ, దాసీలూ కూడా సురక్షితం గానే వున్నారు. ఈ మూడేళ్ళలో వాళ్ళు ఏ నాటికో ఒక నాటికి తిరిగి మామూలు రూపంలో వచ్చే అవకాశం స్పష్టంగా





కనిపిస్తోంది. కనుక దేవుని మీద భారం వేసి అటువంటి సుదినం ఎప్పుడు వస్తుందా అని ఎదురు చూడటం కంటే, మనం చేయగలిగింది ఏ ముంది, తల్లీ!'' అని ధైర్యం చెప్పాడు.

రాజు యింతకు ముందు పెద్ద పెట్టున ఏడుస్తూ రావటం, ఆ తర్వాత తన విచారానికి అనుగుణంగా అనేక విషయాలు జరిగినట్టుగానే రాణికి నచ్చచెప్పటం, అన్నీ రాజు కావాలని కల్పించినవే అని, అక్కడ వున్నవారెవరూ తెలుసుకో లేక పోయారు. తన ముగ్గురు కుమార్తెలూ, వాళ్ళతోపాటు బయల్దేరిన ముగ్గురు దాసీలూ, మరో వంద మంది నౌకర్లూ కన్పించకుండా పోవటం చూసి, రాణి తనను ప్రశ్నిస్తే ఏమి జవాబు చెప్పటమా అని రాజు తీవ్రంగా ఆలోచించే, ఈ నాటకం కల్పించాడు.

షోనీ భూగృహంలో దాచిన సంగతి వెల్లడి చేదామా అంటే ఆ సంగతి తన కుమార్తెలను పొట్టబెట్టుకోవాలని చూస్తున్న దుష్టగ్రహం చెవిని పడుతుందేమోనని రాజు అనుమానం. ఏమైతేనేం, లేక లేక కలిగిన తన కుమార్తెలను రక్షించుకోవటానికని రాజు ఎంతో నేర్పుగా, ఎవరికీ అనుమానం కలగకుండా, ఈ విధంగా పెద్ద అబద్ధం ఆడేశాడు.

రాజు ఆడిన యీ కపటనాటకం రాణీ నమ్మింది. సిబ్బందీలు అందరూ నమ్మారు. కాని ఒకటి; తన పిల్లలు ఎక్కడో ఒక చోట ప్రాణాలతో బ్రతికే వున్నారు అని జ్యోతిష్కుడు చెప్పటం వల్ల రాణీ కొంచెం కుదుటపడింది. ఎక్కడో అక్కడ బ్రతికి బాగా వుంటే, అదే పదివేలు అనుకొని మనస్సులో తృప్తిపడింది. వెంటనే సేవకులను రాజ్యంలో నాలుగు మూలలకూ పంపి, బిడ్డలను వెతికి తెప్పించ వలసిందని రాజును అదేపనిగా వేధింప జొచ్చింది. పిల్లలు భూగృహంలో వున్నారని తెలి



యదా రాజుకి? ఐనా, రాణీ కోరిక ప్రకారం ఆమెను తృప్తిపరచేందుకు సేవకులను దేశం నలుమూలలకీ పంపక తప్పిందికాదు.

తక్షణమే రాజుగారి సేవకులు గుర్రాల మీద బయల్దేరి వెళ్ళారు. కాని ప్రపంచంలో బైట మనుషులకు కనిపించే చోట వుంటేగా ఆ పిల్లలు, ఆ సేవకులకు అచూకీ దొరికేది? వాళ్ళు భూగృహంలో సురక్షితంగా వున్నారాయె. అందువల్ల బయల్దేరి వెళ్ళిన సేవకులు ఒక్కొక్కరే బిడ్డలు కనిపించ లేదంటూ తిరిగి వచ్చేశారు.

రోజులు గడిచిన కొద్దీ రాణీకి బిడ్డల గురించి ఆరాటమూ, బెంగా హెచ్చు అవుతూవుంది. రాజు మాత్రం తెలివిగా నాటకం ఆడి తన పిల్లల సంగతి ఎవరికీ ఏ మాత్రం ఆ చూకీ దొరకకుండా కట్టుబాట్లు చేశాను గదా అని మురిసిపోతున్నాడు. కాని, పైకి మాత్రం తను పిల్లలను గురించి బెంగపడుతున్న వాడిలాగా లోకం కోసం దుఃఖం నటిస్తూనే వున్నాడు.

ఈలోగా రాజు ప్రతి రోజూ మూడో కంటివానికి తెలియకుండా భూగృహంలోకి వెడుతున్నాడు, వస్తున్నాడు. తన ముగ్గురు బిడ్డలూ సురక్షితంగా, తను ఏర్పరచిన నౌకర్ల అండన పెరుగుతూ వుండటం చూచి ఫరవాలేదు కదా అని నిశ్చింతగా వున్నాడు. ఇలా ఒకవారం రోజులు గడిచినై. మళ్ళీ రాజుకు యిప్పుడు మరొక పెద్ద అనుమానం పట్టుకున్నది. అదేమిటీ అంటే—తను భూగృహంలోకి వెళ్ళి, పిల్లలను చూచి, వాళ్ళు సురక్షితంగా వున్నారా లేదా అని తెలుసుకుంటే గాని ఒక్క రోజు కూడా నిలవలేడు. కాని మరో పురుగుకి కూడా తెలియకుండా యిలా రోజూ దొంగతనంగా భూగృహంలోకి వెడుతూ వస్తూ వుండటం చాలా కష్టమైన పనిగా తోచింది. ఒకనాడు కాకపోతే ఒక నాటికైనా ఈ సంగతి ఎవరి కంటనో ఒకరి కంట పడుతుంది.



అది ఆ నోటా ఆ నోటా వెల్లడి అయి, తను ఏ దుష్టగ్రహాన్ని గురించి భయ పడుతున్నాడో ఆ గ్రహానికి తెలిసిపోవచ్చు. పిల్లల జాడ తెలిసిందీ అంటే ఆ గ్రహం ఏదో విధంగా వాళ్ళను పొట్టబెట్టుకుం టుంది కాని మానదు. కనుక, ఏమి చెయ్యుటమా అని రాజు యీ క్రొత్త దిగులుతో కుంగిపోసాగాడు. ఎంత ఆలో చించినా ఏమీ పాలుపోయింది కాదు. ఇలా మరి నాలుగు రోజులు గడిచినై.

ఒకనాడు రాజు ఆ సాయంత్రమే భూగృహంలో పిల్లల్ని చూసి కొంచెం సేపటి క్రితమే వచ్చాడు. బిడ్డలు సుర క్షితంగానే వున్నారు. అందువల్ల రాజు తన శయనాగారంలో ఏ బెంగా లేకుండా నిశ్చింతగా నిద్రిస్తున్నాడు. మంచి నిద్రలో వుండగా ఒక రాత్రివేళ ఎవరో వచ్చి తనను తట్టి లేపుతున్నట్టు అలికిడి అయింది. కళ్ళు తెరిచి చూచాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఎందు వల్లనంటే, ఆ వచ్చినది మరెవ్వరో కాదు, తన ముద్దుల కూతురు సుహాసిని!

కొంత సేపటివరకూ రాజు యిది కల అనే అనుకున్నాడు. కాని సుహాసిని పక్క పైన కూచుని, తండ్రిని ఎక్కి తొక్కుతూ, చిలిపి చేష్టలు చేస్తూ, "నాన్నా, నాన్నా!" అని పిలిచేసరికి, రాజు ఇది ఎంతమాత్రము కల కాదు అని నిశ్చయించాడు. తన కళ్ళ ఎదట తన చిట్టితల్లి సుహాసిని చిన్నారిచేష్టలు చేస్తూ వుంటే, ఎలా కాదనటం? చిలకపలుకు లతో తనను పిలవటం స్పష్టంగా విన బడుతూ వుండగా, ఇది కల అని ఎలా అనుకోవటం? రాజు వెంటనే లేచి తెలివి తెచ్చుకొని, సుహాసినిని గుండెలకి హత్తు కుంటూ, "ఇదేమిటి తల్లీ, ఈ అర్ధరాత్రి వేళ నువ్వు యిక్కడికి ఎలా వచ్చా వమ్మా? ఏరీ, మన దాసీలు ఏరి? పరి వారమంతా ఎక్కడ? నౌకర్లు ఏమైనారు? ఇంతమందినీ విడిచిపెట్టి నీవు ఒక్కర్తెవూ ఎలా వచ్చావు, తల్లీ! చిత్రంగా వుందే,"

అంటూ, ఒక వంక ఆశ్చర్యంతోనూ, మరొక వంక చెప్పరాని ఆత్రంతోనూ వందలూ, వేలూ ప్రశ్నల వెంబడి ప్రశ్నలు కురిపించాడు.

సుహాసిని కొంతసేపటివరకూ బదులు చెప్పలేదు. కాని తండ్రి చెయ్యిపట్టుకొని, మంచం మీదినించి క్రిందికి దిగమని సైగ చేసి, తర్వాత ఆ గదిలో వున్న ఒక పెద్ద పటం దగ్గిరికి తీసుకువెళ్ళి, "అదో, ఆ బొమ్మ చూశా?" అని అడిగింది. రాజుకి ఏమీ అర్థం కాలేదు.

"నువు యిక్కడికి ఎలా వచ్చావు, తల్లీ అని అడుగుతుంటే పటం చూపిస్తా వేమిటమ్మా? ఆ పటం నీకు కావాలం టావా? అలాంటివే కాదు, అంతకన్న మంచి మంచి పటాలు ఎన్నో యిస్తాను. నువ్వు యిక్కడికెలా వచ్చావో ముందు చెప్పు, తల్లీ?" అని రాజు మళ్ళీ బ్రతిమాలసాగాడు.

అప్పుడు సుహాసిని, "అదే నాన్నా! అదే, ఆ పటంలోంచే వచ్చా." అన్నది.

పటంలోంచి ఏమిటి, రావటం ఏమిటి అని రాజు కొంతసేపు మథనపడి, చివరకు పటాన్ని తొలిగించి చూచాడు. పటాన్ని గోడ నించి తొలిగించటం తోటే కంటబడిన దృశ్యం చూసి రాజు కొయ్యబారి, అలాగే నిలబడిపోయాడు. ఎందువల్లనంటే, పటం తీసిన చోట గోడలో ఒక పెద్ద ద్వారం కనిపించింది. రాజు కాసేపటికల్లా తెప్పరిలుకొని, కూతురుని



వెంట బెట్టుకుని, ఆ ద్వారం వెంట లోపలికిపోయాడు. అలా పోగా పోగా అది ఒక సొరంగం అని రాజు తెలుసు కున్నాడు. అందుచేత బిడ్డను నడిపించక, ఎత్తుకుని జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ సాగాడు.

సొరంగంలో సగం దూరం వెళ్ళేసరికి, సుహాసినిని పెంచేటటువంటి దాది ఎదురు వచ్చింది. సుహాసిని గదిలోంచి మాయం అయ్యేటప్పటికి దాది నిద్రలో వున్నది. కాని మరుక్షణంలోనే మెలకువ వచ్చి చూసేసరికి పక్క మీద సుహాసిని లేక పోవటం, అందుకు తగినట్టు గోడలో అదివరకు అద్దం వున్న చోట ద్వారం కనిపించటం, దాదికి హడలు పుట్టించింది.

దాది పిల్లను వెతుక్కుంటూ తనకు తెలియకుండానే ఆ సొరంగంలోకి వచ్చేసింది. పిల్లను వెంట బెట్టుకుని వస్తున్న రాజుని చూచేసరికి ఆమెకు ప్రాణం లేచి వచ్చింది. ముగ్గురూ కలిసి తీరా సొరంగం చివరికి వచ్చి చేరుకునేసరికి, అంతకు ముందు అక్కడ సుహాసిని గదిలోకి దారి నిచ్చే ద్వారం కనిపించలేదు. రాజూ, దాదీ కూడా హడిలిపోయారు. ఒకవేళ యీ సొరంగంలో దారి తప్పి వచ్చామా అని అనుమానం కలిగింది వాళ్ళకు.

రాజు వెంటనే సుహాసినినీ, దాదినీ అక్కడే వుండమని, తను తిరిగి సొరంగం చివరిదాకా పోయాడు. ఎంతదూరం పోయినా ఒక్కటే మార్గం కాని, రెండు మార్గాలున్నట్టు కనిపించలేదు. సొరంగం పోయి పోయి మళ్ళీ రాజు గదిలోకే దారి తీసింది. అందువల్ల రాజు యిప్పుడు మరీ భయపడసాగాడు. ఏమిచేయటమా అనే ఆలోచనతో తిరిగి దాది వున్న చోటికి వచ్చాడు. కాని చిత్రంలో చిత్రం!

ఒక్క క్షణం క్రితం అక్కడ తను వదిలి వెళ్ళిన దాదీ, కుమార్తే కూడా మాయమయ్యారు. ఇదంతా చూచి రాజుకి పిచ్చెత్తినట్లయింది. ఏమీ పాలుపోక అలా ఆ సొరంగంలోనే అటూ యిటూ పచారు చెయ్యసాగాడు. —(ఇంకావుంది)





# తెరరహస్యం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ కిది ఏదో పరీక్షలాగ కనబడు తుంది. ఈ పరీక్షలో నువు నెగ్గినంత మాత్రాన నీకు ఫలం దక్కకపోవచ్చు. అందుకు ఉదాహరణగా నీకు నారాయణ భట్టు కథ చెబుతాను, శ్రమతెలియ కుండా విను." అంటూ ఇలా చెప్ప సాగాడు :

పూర్వం కాశ్మీరదేశంలో నారాయణ భట్టు అనే పండితుడు ఉండేవాడు. అతను సమస్త శాస్త్రాలలోనూ ఆరితేరిన అఖండ మేధావి. అతనికి దేశమంతా తిరుగుదామనీ, ఇతర పండితులతో వాదించి జయించు దామనీ కోరిక



కలిగింది. అందుకని నారాయణభట్టు దేశాటన ప్రారంభించి, ఒక్కొక్క దేశం లోనూ ప్రసిద్ధులుగా ఉండే పండితులతో వాదించి, వారిని ఓడించి, బహుమానాలు పుచ్చుకుంటూ, కాలక్రమాన కళింగ దేశం వచ్చాడు.

కళింగదేశంలోని ఒక అగ్రహారంలో కమలామణి అనే ఒక విదుషీమణి ఉండేది. ఆమె కూడా సమస్త శాస్త్రాలూ చదువుకున్న ప్రజ్ఞావంతురాలు. తనతో వాదించి ఎవరైనా తనను ఓడించి నట్ట యితే అతణ్ణి పెళ్ళిచేసు కుంటాననీ, తనతో వాదించి ఓడిపోయినవాడు తన పాదాలకు నమస్కరించి వెళ్ళిపోవాలనీ ఆమె ఒక ప్రకటన చేసింది. అనేక మంది పండితులైన యువకులు ఆమెతో వాదించి, ఓడిపోయి, ఆమె పాదాలకు నమస్కారం చేసి వెళ్ళిపోయారు.

కళింగదేశం చేరుతూనే నారాయణ భట్టు కమలామణి గురించి విన్నాడు. అతను ఆమె ఉండే అగ్రహారం చేరి, ఊరి చివర ఉండే ఒక బ్రాహ్మణుడి ఇంటికి అభ్యాగతిగా వెళ్ళాడు.

నారాయణభట్టు చెరువుకు వెళ్ళి స్నానం చేసి వచ్చి, భోజనానికి కూర్చుని, కమలామణి గురించి గృహస్థును అడి గాడు. దానికి గృహస్థు, తాను కమలా మణిని చిన్నతనంలో ఎప్పుడో చూశాననీ, యుక్తవయసు వచ్చాక ఆమె ఎవరికీ కనిపించటం లేదనీ, శాస్త్రచర్చకు వచ్చిన వారితో వాదించేటప్పుడు కూడా ఆమె తెర వెనక ఉండి మాట్లాడుతుందనీ, మంచి పాండిత్యం గలది అనీ చెప్పాడు.

భోజనం ముగించి నారాయణభట్టు కమలామణి ఇంటికి వెళ్ళి, తాను ఆమెతో శాస్త్ర చర్చకు వచ్చినట్టు కబురుచేశాడు. ఆ మాట వింటూనే కమలామణి ఒక గదిలో తెర కట్టించి, దానికి ఒక పక్క తాను కూర్చుని, రెండో పక్క నారాయణ భట్టుకు ఆసనం వేయించి, ఆయనను లోపలికి పిలిపించింది.

ఆయన గదిలోకి వచ్చి కూర్చున్నాక కమలామణి, "నా ప్రతిజ్ఞ ఏమిటో మీకు లోగడనే తెలుసును గదా?" అని అడిగింది.

"మీరే చెప్పండి," అన్నాడు నారాయణభట్టు.

"మీరు ఓడితే నా పాదాలకు దణ్ణం పెట్టి వెళ్ళాలి. నేనే గాని ఓడితే మీరు నన్ను పెళ్ళిచేసుకోవాలి. అందుకు ఇష్టమైతేనే వాదనకు దిగండి," అన్నది కమలామణి.

"నేను ఓడిపోతే మీ కాళ్ళకు దణ్ణం పెడతాను. మీరు ఓడితే మిమ్మల్ని పెళ్ళాడటమే ఆలోచనీయం," అన్నాడు నారాయణభట్టు.

కమలామణి ఒక్క క్షణం ఆలోచించి, "సరే, కానియ్యండి," అన్నది.

చాలాసేపు వాళ్ళిద్దరికీ అనేక విషయాల మీద చర్చ జరిగింది. ఇద్దరూ సమాన ప్రజ్ఞ గలవారు. ఒకరి ప్రశ్నలకు ఒకరు సరిగా సమాధానాలు చెప్పారు. నారాయణభట్టు మాత్రం, చిట్టచివరకు తాను ఒక ఆడదానికి ఓడిపోతానేమోనని భయపడుతూ వచ్చాడు. అతను వేసిన ఎంతెంత చిక్కు ప్రశ్నలకూ కమలామణి సునాయాసంగా సమాధానాలు చెప్తున్నది.



కొంతసేపు గడిచాక నారాయణభట్టు కమలామణిని, "మీరు ఎవరివద్ద విద్య నేర్చుకున్నారు?" అని అడిగాడు.

"అన్ని విద్యలూ మా తండ్రిగారి వద్దనే నేర్చుకున్నాను," అని ఆమె జవాబు చెప్పింది.

"మీ వయస్సెంత?" అని నారాయణభట్టు మళ్ళీ అడిగాడు.

"ఇరవైరెండేళ్ళు," అని కమలామణి సమాధానం చెప్పింది.

"మీరీ విధంగా తెర కట్టుకుని, మనుషులకు కనిపించకుండా ఉండటానికి కారణం?" అని నారాయణభట్టు అడిగాడు.

"అది నా నియమం," అన్నది కమలామణి.

నారాయణభట్టు కొంతసేపు ఆలోచించి, తాటాకు మీద ఏదో శ్లోకం రాసి, దాన్ని తెరవెనక్కు విసిరివేస్తూ, "దీనికి అర్థం చెప్పండి," అన్నాడు.

కమలామణి వెక్కి వెక్కి ఏడుస్తూ, "నేను ఓడిపోయాను. నన్ను పెళ్ళి చేసుకోండి," అన్నది.

నారాయణభట్టు ఆసనం మీది నుంచి లేస్తూ, "అది అసంభవం!" అంటూ వెళ్ళిపోయాడు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, తనతో సమాన పాండిత్యం గల స్త్రీ తనకు ఓడిపోయినట్టు ఒప్పుకున్నందుకు సంతోషించక, నారాయణభట్టు ఎందుకు వెళ్ళిపోయాడు? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "నారాయణభట్టు కమలామణి రహస్యాన్ని తెలుసుకున్నాడు తప్ప ఆమెను ఓడించలేదు. స్పష్టంగా ఆమె గుడ్డిది. జటిలమైన ప్రశ్నలకు సమాధానం ఇచ్చిన మనిషి ఒక శ్లోకాన్ని చదివి అర్థం చెప్పమనగానే తాను ఓడినట్టు ఒప్పుకున్నదంటే ఆమె గుడ్డిదని తెలుస్తూనే ఉన్నది. ఆ మాట రూఢి చేసుకునేటందుకే ఆమెకు చదువు చెప్పిన మనిషిని గురించీ, వయసు గురించీ అడిగాడు. తండ్రే గురువు కావటంచేత ఆమె గుడ్డిదన్న సంగతి గుట్టుగా ఉండిపోయింది. ఆమె విద్య పూర్తి అయి ఎంతో కాలం కావటానికి కూడా అవకాశం లేదు. ఎంత పండితురాలైనప్పటికీ, గుడ్డిదాన్ని చేసుకోవటం ఇష్టంలేకగాని, తాను ఆమెను నిజంగా చర్చలో గెలిచినట్టు నమ్మకం లేకగాని నారాయణభట్టు వెళ్ళిపోయి ఉంటాడు," అన్నాడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# ఇంద్రజాలముతో పెళ్లి

సమతటదేశాన్ని పాలించే సామ్యమహా రాజు ఏక సంతానం శ్రావస్తి. ఒకనాడు ఆమె తన చెలికత్తెలతో తప్తికానదికి వెళ్ళి జలక్రీడ లాడుతున్నది. ఆ సమయంలో, మాలాగఢ్ యువరాజు మాల్యుడూ, అవంతికానగరపు యువరాజు అవంతుడూ తమ గుర్రాల మీద పోతూ నదీ తీరం వెంబడి వచ్చారు.

శ్రావస్తి సాటిలేని సౌందర్యవతి. ఆమె సౌందర్యం చూసి ఇద్దరు రాజకుమారులకూ మోహం పుట్టుకొచ్చి, ఆమెను పెళ్ళాడాలన్న కోరిక బలంగా కలిగింది. వారు చెలికత్తెల నడిగి, శ్రావస్తి సమతట రాజకుమార్తె అని తెలుసుకున్నారు.

ఇదంతా చూసి శ్రావస్తి కంగారుపడి, వెంటనే తన పల్లకీ ఎక్కి, చెలికత్తెలతో సహా నగరానికి తిరిగి వెళ్ళింది. రాజకుమారు లిద్దరూ ఆమె వెనకనే వెళ్ళారు.

మాలాగఢ్ రాజ్యం సమతట దేశానికి పశ్చిమ సరిహద్దు అవతల ఉన్నది. దానికి రాజైన మాలవ్యుడు బహు క్రూరుడు. అతని కొడుకు మాల్యుడు తండ్రిలాగే క్రూరుడూ, దురహంకారీ. అతను తన మొదటి భార్యను పెళ్ళి అయిన మర్నాడే కత్తితో పొడిచి చంపేశాడు; ఆమె తన మాట ప్రకారం చెప్పగానే చెయ్యలేదుట! అతనిప్పుడు మరొక భార్య కోసం చూస్తున్నాడు. తండ్రి కొడుకు లిద్దరూ గొప్ప శివభక్తులు.

అవంతిక సమతటకు ఉత్తరాన ఉన్నది. దాన్ని పాలించే అవనీశుడు మహాబల సంపన్నుడు, అయినా ధర్మ బుద్ధీ, దయా గుణమూ కల సజ్జనుడు. ఆయన కొడుకు అవంతుడు అన్నివిధాలా తండ్రిలాటి వాడు. అతనికి ఇంకా వివాహం కాలేదు.

ఏ. సి. సర్కార్, ఇంద్ర[illegible]డు



రాజకుమారు లిద్దరూ నగరంలోకి వచ్చినట్టు తెలియగానే శ్రావస్తి తండ్రి అయిన సామ్యమహారాజు వారిద్దరికీ అతిథిసత్కారం చేశాడు.

మాల్యుడు మహారాజుతో, "నేను మీతో ఒక జరూరు విషయం మాట్లాడవలసి ఉన్నది." అన్నాడు.

అతని మాట పూర్తి కాకుండానే అవంతుడు, "రాజా, నేను మీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలండీ!" అన్నాడు.

సామ్యమహారాజు శాంతంగా వారితో, "నాయనలారా, మీరు అలసిపోయినట్టున్నారు. అతిథి గృహంలో [illegible]జులు విశ్రాంతి తీసుకోండి. ఒకటి, రెండు రోజులలో మీరు చెప్పేది వింటాను. అంతదాకా ఓపిక పట్టండి." అన్నాడు.

ఆయన పరిచారకులు వాళ్ళిద్దరినీ అతిథిభవనానికి తీసుకుపోయి, వారికి అందులో వేరు వేరు మందిరాలు ఇచ్చారు.

మర్నాడు ఉదయం, అవంతుడు అతిథిభవనం ముందున్న పచ్చిక తివాసీ మీద పచార్లు చేస్తూండగా, మాల్యుడు అకస్మాత్తుగా కత్తిదూసి, అతనిపై కలియబడ్డాడు. కత్తియుద్ధంలో ప్రవీణుడైన అవంతుడు తాను కూడా కత్తితో ఆత్మరక్షణ చేసుకోసాగాడు.

సమీపంలోనే తోటపని చేస్తున్న తోటమాలి ఈ భయంకరమైన ద్వంద్వ యుద్ధం చూసి, పెద్ద కేకపెట్టాడు. ఈ కేక విని భటులూ, అధికారులూ పరిగెత్తుకుంటూ వచ్చి, యుద్ధం ఆపారు. రక్షకదళనాయకుడు తోటమాలిని, "ఏం జరిగింది?" అని అడిగాడు.

తోటమాలి అవంతుణ్ణి చూపుతూ, "ఈ బాబుగారు గడ్డిమీద పచార్లు చేస్తుంటే, ఆ బాబుగారు వచ్చి మీద పడ్డారు," అని చెప్పాడు.

"అయ్యా, ఎందుకు అలా చేశారు?" అని రక్షకదళ నాయకుడు మాల్యుణ్ణి అడిగాడు.

"రాజకుమార్తెను ముందు చూసిన వాణ్ణి నేను. నేనే ఆమెను పెళ్ళాడాలి. ఆమెను పెళ్లాడాలనటానికి ఇత నెవడు?" అన్నాడు మాల్యుడు.

"విచారణ జరిపిన మీదట మా ప్రభువు గారే నిర్ణయం చేస్తారు. అంతదాకా మీరు తిరిగి కలియబడకుండా మీ మీద గట్టి నిఘా ఉంటుంది," అన్నాడు రక్షక దళ నాయకుడు.



రాజకుమార్తె శ్రావస్తి నది నుంచి తిరిగి వచ్చిన నాడే, నది దగ్గిర జరిగిన సంగతి తన తండ్రికి చెప్పేసింది. అందుచేత రాజు రాజకుమారుల ప్రవర్తనను కనిపెట్టటానికి అతిథిగృహంలో గూఢచారులను నియమించాడు.

ఈ రోజు మాల్యుడూ, అవంతుడూ ద్వంద్వయుద్ధం చేసిన అనంతరం రాజు ఒకరి తరవాత ఒకరిని పిలిపించి, వారితో మాట్లాడాడు.

ఆయన అవంతుడితో, "అబ్బాయీ, నువు నాతో ముఖ్యమైన విషయం మాట్లాడాలన్నావు. ఏమిటది?" అన్నాడు.

"మహారాజా, మీరు అనుగ్రహించినట్టయితే, మీ కుమార్తెను నాకిచ్చి వివాహం చెయ్యవలసినదిగా మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను. ఆమెను చూసిన క్షణంలోనే ఆమె నా స్వప్నసుందరి అనిపించింది. నేను అవంతికను ఏలే అవినాశుడి కుమారుణ్ణి. నా పేరు అవంతుడు," అన్నాడు అవంతుడు.

సామ్యమహారాజు చిరునవ్వు నవ్వి, "నన్ను ఆలోచించుకోనీ. ఏదో ఒక నిర్ణయం జరిగేదాకా నువు నా అతిథిగా కొద్దిరోజులపాటు ఉండిపో," అన్నాడు.

అవంతుడు వెళ్ళిపోయాక మాల్యుణ్ణి ప్రవేశపెట్టారు. "విశేషం ఏమిటి, అబ్బాయి? నాతో జరూరుగా ఏదో మాట్లాడాలన్నావుకాదూ?" అన్నాడు మహారాజు.

"నా పేరు మాల్యుడు. నేను మాలాగధ రాజైన మాలవ్యుడి కొడుకును. మీ కుమార్తె సౌందర్యం నన్ను సమ్మో



హితుణ్ణి చేసింది. నేను ఆమెను పెళ్ళాడ గోరుతున్నాను,'' అన్నాడు మాల్యుడు.

''రెండో రాజకుమారుడు కూడా నన్ను ఇలాగే కోరాడు. నన్ను ఆలోచించుకోనీ,'' అన్నాడు మహారాజు.

''రాజా, మీరు నాకు రాజకుమార్తెతో పెళ్ళి జరిపి తీరాలి. ఎలాగైనా సరే నే నామెను సాధించుకుంటాను,'' అన్నాడు మాల్యుడు.

''నిర్ణయానికి రావటానికి నాకు కొంత వ్యవధి ఇయ్యి. అంతదాకా నా అతిథి విగా ఉండు.'' అన్నాడు మహారాజు.

భటులు మాల్యుణ్ణి అతిథిగృహానికి తీసుకుపోయారు.

మహారాజు చిక్కులో పడ్డాడు. ఇద్దరు రాజకుమారులూ శ్రావస్తి కోసం తపించిపోతున్నారు. వరులుగా ఇద్దరూ యోగ్యులే. కాని అవంతుడికి వంకలేదు. అతని స్వభావాన్ని గురించీ, ప్రవర్తనను గురించీ సామ్యమహారాజు చాలా విని ఉన్నాడు. అతనితో కొద్దిగా మాట్లాడితేనే అతని వినయమూ, మంచితనమూ మహారాజుకు ఆనందం కలిగించాయి.

మాల్యుడి క్రూరత్వం గురించీ, మొదటి భార్య పట్ల అతని ప్రవర్తన గురించీ కూడా సామ్యమహారాజుకు తెలుసు. అతనితో మాట్లాడిన మీదట అతని మొరటుతనం మరింత బాగా బయటపడింది. ఈ ఇద్దరిలో ఎవరో ఒకరిని శ్రావస్తి పెళ్ళాడవలసి వస్తే ఆమె అవంతుణ్ణే పెళ్ళాడటం ఉత్తమమని మహారాజు అనుకున్నాడు.

వెంటనే ఆయన తన ప్రధానమంత్రిని పిలిపించి, ఆయనతో అంతా చెప్పాడు.

అంతా విని మంత్రి, ''మహారాజా, రాజకుమార్తె అవంతుణ్ణి పెళ్ళాడటం సర్వోత్తమమే, కాని ఒక చిక్కున్నది. మాల్యుడు రాజకుమార్తె కోసం తహతహలాడుతున్నాడు. మీరు ఆమెను ఇయ్యటానికి సూటిగా నిరాకరిస్తే అతనికి క్రోధావేశం వస్తుంది. అతనూ, అతని తండ్రీ

పగబట్టిన తాచులలాటి వాళ్ళు. మనదేశం మీదికి దండెత్తి రావచ్చు కూడా. అందు చేత మనం చెయ్యదలచిన దేదో యుక్తిగా చెయ్యాలి," అన్నాడు.

"ఏమి యుక్తి పన్నగలమో నాకు తెలియటం లేదు," అన్నాడు మహారాజు.

"కొంచెం ఓర్పు వహించండి, మహా రాజా. నాకు ఒక రోజు గడువిస్తే, మన రాజపురోహితుడు తంత్రశాస్త్రితో మాట్లాడ తాను. అన్నట్టు ఈ మాల్యుడూ, ఇతని తండ్రీ గొప్ప శివభక్తులు కాదూ?" అని మంత్రి అడిగాడు.

"అవును, మహామంత్రీ. వాళ్ళూ మనలాగే గాఢమైన శివభక్తి గలవాళ్ళు," అన్నాడు మహారాజు.

"అలా అయితే నా ఆలోచన పార వచ్చు. కాని మన తంత్రశాస్త్రి ఇంద్ర జాలం మనకు సహాయపడాలి," అంటూ ప్రధానమంత్రి శలవు పుచ్చుకున్నాడు.

ఆయన తంత్రశాస్త్రికి విషయమంతా చెప్పి, "ఈ పరిస్థితిలో మాకు నువ్వు నీ ఇంద్రజాలంతో సహాయపడగలవా? నీ సహాయం రాజుగారికి, దేశానికి అవ సరం. దానిమీద రాజకుమార్తె సౌఖ్యం ఆధారపడి ఉన్నది," అన్నాడు.

"ఒకరోజు గడువు ఇస్తే నా శక్తికొద్దీ ప్రయత్నిస్తాను," అన్నాడు తంత్రశాస్త్రి.



ఆయన ఆరుగంటల పాటు తదేకంగా ఆలోచించి, చివరకు ఒక ఉపాయం కనిపెట్టాడు. ఆయన ప్రధానమంత్రి వద్దకు వెళ్ళి తన ఆలోచన చెప్పేసరికి, మంత్రి పరమానందం చెందాడు.

తంత్రశాస్త్రి పథకం ప్రకారం మహా రాజు మాల్యుణ్ణీ, అవంతుణ్ణీ పిలిపించి, "నాయనలారా, మీరిద్దరూ మా అమ్మా యిని వివాహమాడ గోరుతున్నారు. మీ యిద్దరి తండ్రులూ గొప్పరాజులు. మీరిద్దరూ అందగాళ్ళే, మా అమ్మాయికి తగినవాళ్ళే. మీలో నేను ఎవరిని అల్లుడుగా ఎన్నుకున్నా రెండో వారికి అన్యాయం చేసినవాణ్ణి అవుతాను. అది



నా కిష్టంలేదు. అందుచేత ఎన్నిక చేసే బాధ్యత రాజపురోహితు డైన తంత్రశాస్త్రికి వదిలిపెట్టాను. ఆయన రేపు శివాలయంలో అర్చనలు చేసి, నిర్ణయం చేస్తాడు.'' అన్నాడు. తరవాత ఆయన తంత్రశాస్త్రితో, ''మీరు చేయబోయేది ఏమిటో వాళ్ళకు చెప్పండి,'' అన్నాడు.

తంత్రశాస్త్రి లేచి నిలబడి, ''మహారాజా, నేను చివరి నిర్ణయం మహాశివుడికే విడిచిపెట్టుతున్నాను. ఆయన నిర్ణయానికి మీరు బద్ధులుగా ఉంటారు గద?'' అని రాజకుమారులను అడిగాడు.

''నాకు సమ్మతమే,'' అన్నాడు అవంతుడు.

మాల్యుడు కొంచెం ఆలోచించి, ''నాకూ సమ్మతమే,'' అన్నాడు.

తంత్రశాస్త్రి ఆ రాత్రంతా శివాలయంలోనే ఉండిపోయి, శివుడి పేర మోసం చేస్తున్నందుకు ఆ దేవుడికి క్షమాపణలు చెప్పుకుంటూ, ఏడ్చాడు.

తెల్లవారింది. ఆకుల తోరణాలతోనూ, పువ్వులతోనూ చక్కగా అలంకరించిన ఆలయానికి అవంతుడూ, మాల్యుడూ, రాజపరివారమూ వచ్చారు. తంత్రశాస్త్రి లేచి, రాజకుమారులతో, ''దేవుడి నిర్ణయానికి బద్ధులమై ఉంటామని దేవుడిపై ప్రమాణం చెయ్యండి,'' అన్నాడు.

వాళ్ళు అలాగే చేశారు.

తంత్రశాస్త్రి రెండు అగ్గిపెట్టెల లాటి అట్టపెట్టెలు పైకి తీశాడు. వాటికి సొరుగులున్నాయి. వాటిమీద వేరు వేరుగా మాల్యుడి పేరూ, అవంతుడి పేరూ రాసి ఉన్నాయి. తంత్రశాస్త్రి ఆ పెట్టెల సొరుగులలో ఏమీ లేదని చూపి, ఆ పెట్టెలను దేవుడి ముందు పెట్టాడు; తరవాత రెండు చిన్న కాగితం ముక్కల మీద రాజకుమార్తె శ్రావస్తి పేరు రాసి, రెండు పెట్టెలలోనూ పెట్టి సొరుగులు మూసేశాడు. తరవాత ఆయన పవిత్ర జలం తీసుకుని పెట్టెల మీదా, రాజకుమారుల పైనా చల్లి, ''మహాశివా, కరుణించు,

మా రాజకుమార్తెకు తగిన భర్త లభించు గాక!" అని ప్రార్థించాడు.

కొంచెంసేపు ఆగి తంత్రశాస్త్రి మాల్యుడి పేరుగల పెట్టె తీసుకుని, సొరుగు తెరిచాడు. సొరుగులో ఏమీ లేదు. అదే విధంగా అవంతుడి పేరుగల పెట్టె తీసి చూస్తే, అందులో రెండు చీట్లు ఉన్నాయి. రెంటి మీదా శ్రావస్తి పేరు ఉన్నది.

"మహాశివుడు రాజకుమార్తె శ్రావస్తికి అవంతుణ్ణి భర్తగా నిర్ణయించాడు!" అని తంత్రశాస్త్రి ప్రకటన చేశాడు.

మాల్యుడు మారు మాటాడకుండా ఆ నిర్ణయానికి తల వంచాడు. అతను శివుడికి నమస్కారం చేసి, అవంతుణ్ణి ఆలింగనం చేసుకుని, తన గుర్రం ఎక్కి వెళ్ళిపోయాడు.

అవంతుణ్ణి మంగళవాద్యాలతో వైభవంగా రాజభవనానికి తీసుకుపోయారు. ప్రధానమంత్రి మాత్రం అక్కడే దిగబడి, "శాస్త్రిగారూ, ఇంత సులువుగా ఇంత అద్భుతమైన ఇంద్రజాలం ఎలా చేశారు? మీ తెలివి నిజంగా అమోఘం! రహస్యం ఏమిటో శాస్త్రి చెబుతారా?" అని అడిగాడు.

"పెట్టెలు అవిగో. వాటిని చూస్తే రహస్యం మీకే తెలుస్తుంది," అన్నాడు తంత్రశాస్త్రి.




మంత్రి మాల్యుడి పేరుగల పెట్టెను తీసుకుని, అటూ ఇటూ తిప్పి చూశాడు. దాని రెండు పక్కలా మాల్యుడి పేరు రాసి ఉన్నది. అవంతుడి పేరు కూడా రెండో పెట్టెకు రెండు పక్కలా రాసి ఉన్నది.

మంత్రి మాల్యుడి పేరుగల పెట్టె సొరుగు బయటికి లాగాడు. సొరుగు దిగువ నుంచి ఒక చీటీ కింద పడింది. దాని మీద శ్రావస్తి పేరు రాసి ఉన్నది. సొరుగును బయటికి లాగి చూసేసరికి, అందులో పైన ఒక అరా, దానికి కిందుగా ఒక అరా ఉండి, మధ్యలో అట్ట ఉన్నది. అలాగే అవంతుడి పేరుగల పెట్టె సొరు

గులో కూడా పైనా, కిందా అరలు ఏర్పా టయి వున్నాయి.

తంత్రిశాస్త్రి చేసిన ఇంద్రజాలం మంత్రికి అర్థమైపోయింది. శాస్త్రి అపంతుడి పెట్టెసొరుగు దిగువ అరలో ముందుగానే శ్రావస్తి పేరు గల చీట్లు రెండు ఉంచాడు. తరవాత అందరి సమక్షంలోనూ రాసిన చీట్లను పై అరలలో పెట్టేటప్పుడు, అపంతుడి పెట్టెలోని దిగువ అరలో ఉన్న చీట్లు కింద పడిపోకుండా తన వేలితో నొక్కి పెట్టాడు. తరవాత ఆయన రెండు పెట్టెలనూ తలకిందులు చేసి దేవుడి ముందుంచాడు. పెట్టెలకు పైనా కిందా కూడా పేర్లు రాసి ఉండటంచేత ఎవరూ మోసం శంకించలేదు. తిరిగి పెట్టెలు తెరిచేటప్పుడు అపంతుడి పెట్టె దిగువ అరలో ముందుగానే దాచి ఉంచిన రెండు చీట్లు బయటికి వచ్చాయి. మాల్యుడి పెట్టె దిగువ అరలో చీటియే లేదు. అందరూ చూస్తూండగా శాస్త్రి పెట్టిన చీట్లు, పెట్టెలు తలకిందులు చేసి నప్పుడు దిగువ అరలో ఉండిపోయాయి. అవి కిందపడిపోకుండా శాస్త్రి తన వేళ్లతో నొక్కిపెట్టాడు.

"ఇదా రహస్యం?" అంటూ మంత్రి చూసే సరికి శాస్త్రి పసిపిల్ల వాడిలా ఏడుస్తూ కనిపించాడు.

"మహాశివుడు నన్ను క్షమిస్తాడా? ఆయన పేరు చెప్పి మహాపాపం చేశాను," అన్నాడు శాస్త్రి.

"మిత్రమా, నువు చేసిన పాపం ఏమీ లేదు. దేవుడి పేరుచెప్పి నువు మోసం చేసినది ఎవరిని? ఒక క్రూరుణ్ణి, పాషాణ హృదయుణ్ణి! ఈ పనిచేసి ఒక అమాయకురాలిని ఒక కిరాతకుడి బారినుంచి కాపాడావు; నీ రాజునూ, నీ మాతృ దేశాన్నీ, నీ జాతినీ రక్షించావు. అంత పెద్ద ఆశయంతో ఈ చిన్నమోసం చేసినందుకు మహాశివుడు నిన్ను తప్పక క్షమిస్తాడు!" అన్నాడు మంత్రి.

ఈ మాటలు విని కొంత ఊరడిల్లి, తంత్రశాస్త్రి తన కళ్ళు తుడుచుకున్నాడు.







మహేంద్రవర్మ అనే రాజు ఏలే రాజ్యంలో ఒకప్పుడు దొంగల బాధ చాలా ఎక్కువ అయింది. రాజు దొంగలను పట్టటానికి గట్టి ప్రయత్నం చేసి, చాలామంది దొంగలను పట్టకుని కఠినంగా శిక్షించాడు. అయినా దేశంలో దొంగతనాలు పూర్తిగా పోలేదు. రంగడు అనే గజదొంగ రాజును లక్ష్యపెట్టక తన మానాన తాను దొంగతనాలు చేస్తూవచ్చాడు.

ఇలా ఉండగా రాజు వద్దకు ఒక ముని వచ్చాడు. మునులంటే భక్తి కావటంచేత రాజు ఆ మునిని గౌరవించి, ఆయనకు ఆతిథ్యం ఇచ్చి, తన దేశంలో దొంగల బాధను గురించి చెప్పాడు.

''రాజా, నీ దేశంలో రంగడు అనే గజ దొంగ ఉన్నాడు. వాణ్ణి పట్టుకుంటే దేశానికి దొంగల బాధ పూర్తిగా పోతుంది,'' అన్నాడు ముని.

రాజు మునిని కొన్ని రోజులపాటు తన అతిథిగా ఉండమని కోరాడు. ముని సరేనన్నాడు. ఆ తరవాత మూడు రోజులు వరసగా రాజుగారి ఖజానాలోనే దొంగతనం జరిగింది. రాజు ఈ సంగతి మునికి చెప్పాడు.

''రాజా, ఇది ఆ రంగడి పనే. ఆ రంగడు వచ్చి క్షమాపణ చెప్పుకుంటే మంచి బహుమానం ఇస్తానని చాటింపు వేయించు. ఆ తరవాత నీకు వాడి బాధ ఉండదు,'' అన్నాడు ముని.

రాజు అలాగే చాటింపు వేయించాడు.

మర్నాడు ముని రాజుగారి కొలువుకు వచ్చి, ''మహారాజా, క్షమించండి. మీ ఖజానాలో నేనే దొంగతనం చేశాను. నేనే రంగణ్ణి. మారువేషం వేసుకుని మీ వద్దకు వచ్చాను.'' అంటూ తన వేషం విప్పేశాడు.

సి. విశ్వనాథరావు

ఇది చూసి రాజు ఆశ్చర్యపోయాడు. రంగడి తెలివి ఆయనకు అద్భుత మని పించింది. చాటింపు వేసిన ప్రకారం రాజు రంగడికి బహుమానం ఇయ్యటమే గాక, వాడికి మరొక పని కల్పించే ఉద్దే శంతో వాడికి చిన్న ఉద్యోగం కూడా ఇచ్చాడు.

కొన్నాళ్ళు గడిచినాక రాజు రంగడికి ఒక ఉత్తరం ఇచ్చి, "దీన్ని మన పొరుగు రాజు జయసింహుడికి ఇచ్చి, సమాధానం తీసుకురా," అన్నాడు.

రంగడు సరేనని, గుర్రం ఎక్కి, పొరుగు దేశానికి బయలుదేరాడు. దారిలో అడవి వచ్చింది. రంగడు ఆ అడవి గుండా వెళుతుండగా దారిలో ఒక ముసలివాడు కనిపించి, రంగణ్ణి ఆగమని కోరాడు. రంగడు ఆగాడు.

"అయ్యా, మీరు ఏ ఊరు పోతు న్నారు?" అని ముసలివాడు అడిగాడు.

"పక్క రాజ్యానికి," అని రంగడు చెప్పాడు.

"అయ్యా, నన్ను కూడా మీతో బాటు గుర్రం మీద తీసుకుపొండి. నేను త్వరగా వెళ్ళాలి," అన్నాడు ముసలివాడు.

"అక్కడ నీకేం పని?" అని రంగడు అడిగాడు.

"నేను పేదవాణ్ణి. ఎంతో కాలంగా కూడబెట్టిన డబ్బుతో నా కూతురి పెళ్ళికి నగా నట్రా కొనాలి," అన్నాడు ముసలివాడు.

రంగడు వెంటనే కత్తి పైకి తీసి, "చాల్లే! ఆ డబ్బు నాకు ఇచ్చేసి ఇంటికిపో!" అన్నాడు ముసలివాడితో.

మరుక్షణమే పొదలచాటు నుంచి రాజభటులు వచ్చి రంగణ్ణి పట్టుకున్నారు.

రాజభటులు వాణ్ణి రాజు దగ్గిరికి తీసుకుపోయారు. రాజు వాడితో, "నువు దొంగతనాలు మానేశావు గాని, నీ దొంగ బుద్ధి మారిందో లేదో తెలుసుకునే టందుకు ఇలా చేశాను. నువు యావ జ్జీవం కారాగృహంలోనే ఉండు," అన్నాడు.





# పగలు - రాత్రి

దానయ్య అనే ఆయన ధర్మాత్ముడు కావటం చేత, అడిగిన వారికందరికీ లేదనకుండా అప్పులిచ్చి, ఉన్నదంతా తగలేసి చచ్చిపోయాడు. దానయ్య కొడుకు జగదీశుడు బికారిగా మిగిలిపోయాడు. రాతకోతలు లేనందుచేత అప్పులు తీసుకున్నవాళ్ళెవరూ బాకీలు చెల్లించలేదు. జగదీశుడికి ఊరి మీదా, ఊరి వాళ్ళ మీదా రోతపుట్టి, మరెక్కడైనా బతుకు తెరువు చూసుకుందామని బయలుదేరాడు.

ఆ రోజూ, ఆ రాత్రి కూడా వాడు అడవిదారుల వెంట నడిచి, మర్నాడు వేకువ ఝామున ఒక నది చేరుకున్నాడు. నదీ తీరాన కొంత దూరంలో వాడికొక అందమైన భవనం కనబడింది. జగదీశుడు దానికేసి నడిచాడు. సూర్యోదయం కావస్తున్నది.

ఆ భవనం నుంచి ఒక మనిషి రొప్పుతూ జగదీశుడికి ఎదురుగా పరిగెత్తుకు వచ్చాడు. ఆ మనిషి బట్టలు చిరిగి ఉన్నాయి. వాడి వీపుమీద వాతలు ఉన్నాయి. జగదీశుడు ఆ మనిషిని ఆపి, "ఎందుకిలా భయపడి పారిపోతున్నావు? నీ వీపుమీద ఈ వాతలు ఏమిటి?" అని అడిగాడు.

ఆ మనిషి క్షణం ఆగి, చుట్టూ చూసి, "ఎరగకపోయి నిన్న ఆ భవనంలో కాలు పెట్టాను. అందులోకి పగలూ, రాత్రీ వస్తాయని నాకేం తెలుసు?" అంటూ తిరిగి చూడకుండా కాలిసత్తువకొద్దీ పరిగెత్తి వెళ్ళిపోయాడు.

జగదీశుడికి ఆ మనిషి మాటలు ఏమీ అర్థం కాలేదు. వాడు కుతూహలంతో ఆ భవనంలో ప్రవేశించాడు. లోపల విశాలమైన గదులూ, అందంగా దీపాలూ,

ఎం. కామేశ్వరరావు



తెరలూ, శయ్యలూ, చిత్రపటాలూ చూడ ముచ్చటగా ఉన్నాయి. ఎక్కడా మనిషి జాడ మాత్రం లేదు. జగదీశుడు భవనం అంతా కలయ తిరిగి, మళ్ళీ ముందు గదిలోకి వచ్చాడు.

"యజమానిగారికి నమస్కారం! క్షమించాలి. ఈ రోజు మేఘాల మూలంగా సూర్యోదయం ఆలస్యంగా అయింది. అందుకే నేను ఆలస్యంగా వచ్చాను." అన్న మాటలు వినిపించేసరికి జగదీశుడు తుళ్ళిపడ్డాడు.

గుమ్మంలో ఒక అందమైన యువతి నిలబడి ఉన్నది. ఆమె పైనుంచి కింది వరకూ తెల్లని దుస్తులు ధరించి ఉన్నది. ఆమె మెడలో మెరుస్తున్న ముత్యాల దండ ఉన్నది. ఆమె చేతిలో అందమైన నెమలిఈకల విసనకర్ర ఉన్నది.

"ఎవరు నువు? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అని జగదీశుడు ఆమెను ఆశ్చర్యంగా అడిగాడు.

"నా పేరు పగలు. ఈ భవనానికి వచ్చిన అతిథులకు సేవ చేయటం నా పని." అంటూ ఆమె నడుము బిగించి, పనిలోకి దిగింది. ఆమె అన్ని గదులూ ఊడ్చింది; పొయి రాజేసి, రకరకాల పిండి వంటలతో బ్రహ్మాండమైన విందు భోజనం సిద్ధం చేసింది. జగదీశుడు కళ్ళు పెద్దవి చేసుకుని ఆమె చర్యలన్నీ గమనించాడు.

"వంట సిద్ధం అయింది. మీరు భోజనానికి లేవవచ్చు." అని ఆమె ఒక బల్లపై వెండి పళ్ళెంలో అన్నీ వడ్డించి, జగదీశుడి చేత భోజనం చేయించింది.

జగదీశుడు తృప్తిగా భోజనం చేసి, తాంబూలం సేవిస్తూ ఉండగా, ఆమె వాడి వినోదం కోసం ఆడింది, పాడింది. ఎండవేళ జగదీశుడు పట్టుపరుపు మీద పడుకుంటే, నెమలిఈకల విసనకర్రతో ఆమె వాడికి విసురుతూ కూర్చున్నది.

జగదీశుడికి మెలకువ వచ్చేసరికి సాయంత్రం అయింది.

ఆమె వాడితో, "సూర్యాస్తమయం కాబోతున్నది. ఇక నేను వెళ్ళి, మళ్ళీ రేపు ఉదయం వస్తాను," అన్నది.

ఈ మాట విని జగదీశుడు బాధ పడి, "నువు వెళ్ళవలసిన అవసరం ఏమిటి? ఇక్కడే ఉండిపో!" అన్నాడు ఆమెతో.

"అయ్యో, ఇంకేమైనా ఉందా? రాత్రి వచ్చి నన్ను మింగెయ్యదూ?" అని ఆమె వేగంగా వెళ్ళిపోయింది.

జగదీశుడు నిరాశగా ఆమె వెళ్ళిన గుమ్మం కేసే చూస్తూ, ఒక్కసారిగా దడుచుకున్నాడు. ఎందుకంటే, గుమ్మంలో నల్లని వస్త్రాలు ధరించిన భయంకరమైన యువతి నిలబడి ఉన్నది. ఆమె ఒంటిరంగు కారునలుపు; మెడలో నల్లని పూసల దండ ధరించి, చేతిలో కొరడా పట్టుకుని ఉన్నది.

అలాగే కూర్చుని ఉన్న జగదీశుణ్ణి చూసి, ఆమె పళ్ళు పటపట కొరుకుతూ, "ఎంత తల బిరుసురా నీకు! నేను రాత్రిని ఇక్కడ నిలబడి ఉంటే నువు కూర్చుని ఉంటావా? ఇలారా!" అంటూ కొరడా ఝుళిపించింది.

ఆమె కళ్ళలోనూ, కంఠంలోనూ ఉన్న అధికారాన్ని ధిక్కరించటం జగదీశుడికి సాధ్యం కాలేదు. వాడు లేచి ఆమె వేపు నడిచాడు.



"వెనక్కు తిరుగు!" అన్నది రాత్రి. జగదీశుడు తిరిగాడు. ఆమె కొరడాతో వాడి వీపు మీద ఛెళ్ళుమని కొట్టింది. జగదీశుడి వీపు భగ్గున మండింది. వాడి చొక్కా చిరిగి, వాతపడిన చోట ఇంత ఎత్తున పొంగింది.

వాడు బాధ పడుతూంటే రాత్రి విరగబడి నవ్వి, "అప్పుడే ఇలా గిజగిజలాడిపోతే ఎలా? తెల్లవారేలోగా ఇంకా మూడు కొరడా దెబ్బలు తినాలి. ఝాము ఝాముకూ ఒక చరుపు చరుస్తాను. సమయం తెలుసుకోవటానికి నీ వీపు మీది వాతలే నాకు ఆధారం. అసలే మతిమరుపుదాన్ని! వేళ మరిచిపోయానంటే



పగలు వచ్చేస్తుంది. పగలు వచ్చిందంటే ఇంకేమన్నా ఉందా? దానిలో కరిగి పోనూ?'' అన్నది.

తరవాత రాత్రి జగదీశుడి చేత ఇల్లంతా తుడిపించింది. పొయ్యి రాజేయించింది. వంట చేయించింది. వాడు తనకు వెండిపళ్ళెంలో వడ్డించగా ఆరగించింది. తరవాత తాను తాంబూలం నములుతూ జగదీశుడితో, "నన్ను ఆనందింపజెయ్యి," అన్నది.

జగదీశుడు ఆడాడు, పాడాడు. రెండవ ఝాము ఆరంభంలో వాడి వీపు మీద రెండో కొరడా దెబ్బవేసింది. తరవాత ఆమె వాణ్ణి సూదులతో గుచ్చుతూ, సరదాగా ఆనందించింది. మూడవ ఝాము మొదట్లో ఆమె వాడి వీపు మీద కొరడాతో మూడోసారి ఛెళ్ళుమనేలా గట్టిగా కొట్టి, వాడు విసురుతూ ఉండగా కాస్సేపు నిద్రపోయింది.

ఆమె నిద్ర లేచాక జగదీశుడి వీపు మీద వాతలు లెక్క పెట్టి, మూడు ఝాములు గడిచాయని గుర్తుచేసుకుని, నాలుగో ఝాము మొదట్లో నాలుగో దెబ్బ వేసి, కొంతసేపు జగదీశుడి జుట్టు పీకి, బట్టలు చించి, బాధలు పెట్టి, సూర్యోదయం కాబోతూ ఉండగా, "మళ్ళీ సాయంత్రం అయాక వస్తాను. పగలు వచ్చిందంటే ప్రమాదం!'' అని కంగారుగా వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిన కొద్ది సేపటికే వందనాలు చేస్తూ పగలు వచ్చింది. ఆమె వస్తూనే జగదీశుడి వీపుమీది వాతలను తన నెమలిఈకల విసనకర్రతో తాకింది. ఆశ్చర్యం! అవి వెంటనే మాయమయాయి. తరవాత ఆమె ఇల్లు శుభ్రం చేసి, చక్కని భోజనం ఏర్పాటు చేసి, జగదీశుడు నిద్రపోతూంటే విసురుతూ కూర్చుంది.

నిద్ర నటిస్తున్న జగదీశుడు లేచి, "దాహం! మంచి నీళ్ళు కావాలి,'' అన్నాడు.

ఆమె విసనకర్ర అక్కడే పెట్టి, లోపలికి వెళ్ళింది. జగదీశుడు ఆ విసనకర్ర నుంచి ఒక నెమలి ఈకను తీసి, పరుపు కింద దాచాడు.

సూర్యాస్తమయం కాబోతూండగా పగలు వెళ్ళిపోయింది. మరి కాస్సేపటికి రాత్రి వచ్చింది. వెనకటి లాగే ఆమె జగదీశుడి వీపు మీద కొరడా దెబ్బ కొట్టి, వాడిచేత అడ్డమైన చాకిరీ చేయించుకున్నది. రెండో ఝాము మొదట్లో రెండో దెబ్బా, మూడో ఝాము మొదట్లో మూడో దెబ్బా వేసి, ఆమె పడుకున్నది.

జగదీశుడు పరుపు కింద ఉన్న నెమలి ఈక పైకి తీసి, దానితో తన వీపు మీది మూడు వాతలలో ఒక దాన్ని తాకాడు. వెంటనే అది మాయమయింది.

నాలుగో ఝాము మొదట్లో రాత్రి లేచి, కొరడా తీస్తూ, "ఇదీ ఆఖరి ఝాము అనుకుంటాను," అన్నది.

"నీకు మతిమరుపు బాగా వచ్చేసింది. ఇప్పటికి రెండు ఝాములే గడిచాయి. కావలిస్తే చూడు," అంటూ జగదీశుడు తన వీపు చూపించాడు.

"అయితే మరో ఝాము నిద్రపోవచ్చు," అని ఆమె వాడి వీపు మీద కొరడాతో మరో చరుపు చరిచి, మళ్ళీ నిద్రపోయింది.

రాత్రికి మెలకువ వచ్చేసరికి సూర్యోదయం అయే పోయింది. అప్పటికి పగలు లోపలికి రాను కూడా వచ్చింది.

ఆమెను చూడగానే రాత్రి కెవ్వున అరిచి బయటికి పరుగు తీసింది. కాని సూర్య కిరణాలు సోకగానే రాత్రి శరీరం మంచులా కరిగిపోయింది.

"రాత్రి పోయాక నేను మాత్రం ఇక్కడ ఎందుకూ? అది వస్తున్నదనే నేనూ వచ్చాను," అంటూ పగలు కూడా వెళ్ళిపోయింది.

తన వద్ద ఉండిన నెమలి ఈకతో రోగాలకూ, గాయాలకూ చికిత్స చేస్తూ, జగదీశుడు తనకు నచ్చిన పిల్లను పెళ్ళాడి ఆ భవనంలోనే ఉండిపోయాడు.





# సవతి పోటు

పూర్వం బాగ్దాదునగరంలో ఒక గొప్ప వ్యాపారస్థుడు ఉండేవాడు. అతని భార్య సౌందర్యవతీ, అనుకూలవతీనూ. వారి ద్దరూ ఎంతో ప్రేమగా, అన్యోన్యంగా ఉండేవారు; పరస్పరం ఎంతో గౌర వించుకునేవారు.

భర్త నెలకు పదిహేను రోజులు నగ రంలో ఉండేవాడు కాదు. ఆ పక్షం రోజులూ అతను ఎక్కడ గడిపే వాడో భార్యకు తెలియదు. ఇంట ఉన్న పక్షం రోజులూ భార్య పట్ల ఎంతో అనురాగంగా ఉండే వాడు; ఆమెకు ఎంత చిన్న కష్టం కూడా కలగనిచ్చే వాడు కాదు. అందు చేత అతన్ని అతని భార్య, నెలకు పది హేను రోజులు ఎక్కడికి పోతావు అని అడిగేది కాదు. కాని భర్త అయినా తానై ఆమెకు ఆ సంగతి చెప్పేవాడు కాడు. అయితే భార్యకు మటుకు భర్త ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకోవాలని మనసులో ఉండేది.

కొంతకాలం గడిచింది. భర్త ప్రవర్త నలో ఏమీ మార్పులేదు. అతను నెలకు పదిహేను రోజులు ఎక్కడికో వెళ్ళి పోతున్నాడు; తన ఇంట ఉన్న పదిహేను రోజులూ భార్యను ఎంతో ప్రేమగా చూస్తున్నాడు.

ఆఖరుకు భార్య ఓర్పు వహించలేక పోయింది. తన భర్త ఎక్కడికి పోతాడో, ఎక్కడ ఉంటాడో తెలుసు కోవాలన్నది ఆమెకు మనోవ్యాధిగా పరిణమించింది. తనకు నమ్మకమైన ముసలావిడతో తన భర్త సంగతంతా చెప్పి, ఆమెకు అవసర మైన ధనం ఇచ్చి, ఎలాగైనా తన భర్త రహస్యాన్ని తెలుసుకు రమ్మన్నది భార్య. ఆ సమయంలో వ్యాపారస్థుడు నగరంలో లేడు.

కుమారి ఆమీనా అజ్మల్

కొన్నాళ్ళకు ఆ ముసలావిడ తిరిగి వచ్చి, ఆ వ్యాపారస్థుడు ఇంకొక నగరంలో మరొక స్త్రీని పెళ్ళి చేసుకున్నాడనీ, సగం నెల అతను ఆ భార్యతో గడుపు తున్నాడనీ వివరాలతో సహా చెప్పింది.

వ్యాపారస్థుడి భార్య ముసలావిడకు బహుమానం ఇచ్చి, ఈ సంగతి ఎవరికీ చెప్పనని ప్రమాణం చేయించుకున్నది. ఆమెకు తన సవతిని తలుచుకుంటే అసూయ కలిగింది. ఇంత కాలమూ ఈ సంగతి తనకు చెప్పకుండా దాచినందుకు ఆమెకు తన భర్త మీద కోపం కూడా వచ్చింది. కాని భర్త తన పట్ల చూపే ప్రేమాదరాలలో ఎలాటి లోపమూ లేనందున తాను అతని స్వవిషయం గురించి అడగరాదని ఆమె అనుకున్నది. తనకు తెలిసిన రహస్యాన్ని ఆమె తనలోనే దాచుకున్నది. తన రహస్యం తన భార్యకు తెలిసిపోయిందన్న సంగతి భర్త ఎరగడు.

ఇలా ఉండగా ఒకనాటి రాత్రి వ్యాపారస్థుడు అకస్మాత్తుగా గుండెపోటుతో మరణించాడు. అతనికి పిల్లలు లేనందువల్ల అతని ఆస్తి అంతా అతని బంధువులకు పోయింది. భృతి కింద అతని భార్యకు ఒక వాటా వచ్చింది.

భర్త పోయిన దుఃఖం నుంచి బయట పడగానే వ్యాపారస్థుడి భార్యకు తన సవతి గుర్తుకొచ్చింది. నిజానికి ఆమె కూడా తన భర్తకు తనలాటి భార్యే;



తనలాగే ఆమె కూడా అతన్ని సుఖ పెట్టింది. అందుచేత ఆమెకు అతని ఆస్తిలో తనతో బాటు భాగం ఉన్నది. తా మిద్దరూ ఒకరి ముఖం ఒకరు చూడ లేదు. ఆమెను గురించి తన భర్త తనకు ఏనాడూ చెప్పలేదు. అయినా అధర్మానికి ఒడబడలేక ఆమె తన వంతు ఆస్తిలో సగం భాగం తన సవతిపేరరాసి పూర్వం నియోగించిన ముసలావిడ ద్వారానే ఆ పత్రాన్ని పంపుతూ ఇలా ఒక ఉత్తరం రాసింది:

"చెల్లీ, ఇంతకాలమూ నేను నిన్ను చూడలేదు. నా భర్త అయినా నీ సంగతి నాకు చెప్పలేదు. అయితే, ఆయన నిన్ను పెళ్ళాడాడనీ, నీతో కాపరం చేస్తున్నాడనీ నాకు తెలియ వచ్చింది. ఆ సంగతి నా భర్తకు నేను తెలియ నివ్వలేదు. ఇప్పుడు నా భర్త దూర ప్రయాణం మీద శాశ్వతంగా వెళ్ళి పోయాడు. అందుచేత నాకు వచ్చిన అతని ఆస్తిలో సగంవాటా నీకు కూడా ఉంటుంది. దాన్ని నీకు పంపుతున్నాను. స్వీకరించు. నీ రహస్యం నీకూ, నాకూ, ఈ ముసలావిడకూ, భగవంతుడికీ తప్ప మరెవరికీ తెలీదు."

కొన్నాళ్ళకు ముసలావిడ మరొక ఉత్తరంతో తిరిగి వచ్చింది:

"అక్కా, నన్ను గురించి తెలుసుకుని కూడా ఎవరికీ చెప్పని నీ ఓర్పు చాలా గొప్పది. నీ ఔదార్యం కూడా అసాధారణ మైనది. కాని, నీ ఆస్తిలో భాగం న్యాయంగా నాది కాదు. ఎందుకంటే, నీ భర్త పోయేముందు కొద్దిరోజుల క్రితం మాకు విడాకులు జరిగాయి. అందుచేత నేను ఆయన భార్యను కాను, నీ సవతిగా కాక, నీ చెల్లెలుగా నన్ను స్వీకరించు. మనం జీవితాంతం అక్క చెల్లెళ్ళుగా ఉందాం."

ఈ ఉత్తరం చదువుకుని వ్యాపారస్థుడి భార్య ఆమె నిజాయితీకి ఆశ్చర్యపడి, అది మొదలు ఆమెతో స్నేహసంబంధాలు పెట్టుకున్నది.



# 153. ప్రాచీన గ్రీకు నాటకరంగం

ఎపిడౌరస్ వద్ద ఈ ప్రాచీన నాటకశాలను పోలీక్లిటస్ అనే విఖ్యాత శిల్పి నిర్మించాడు. చిత్రంలోని వలయంలో నటులు నిలబడేవారు. ఈ నాటకశాలలో 16,000 మంది ప్రేక్షకులు కూర్చునే చోటు ఉండేది. దీని నిర్మాణంలో గల విశేషమేమంటే, నటులకు అతిదూరంగా ఉన్న ప్రేక్షకుడికి కూడా నటుల సంభాషణ స్పష్టంగా వినపడేది.





# డంబం ఖరీదు

ఒక గ్రామంలో శంకరుడు అని ఒక యువకుడు ఉండేవాడు. వాడికి కొత్తగా వివాహం అయింది. తరవాత కొద్ది రోజులకే పండగ వచ్చింది. పండగకు వాడు అత్తవారింటికి పోవాలనుకున్నాడు. అత్తవారి గ్రామం చాలా దూరం. ప్రయాణానికి వీలుగా ఉంటుందనీ, చూసేవాళ్ళకు గొప్పగా ఉంటుందనీ అనుకుని శంకరుడు ప్రయాణానికి ఒక గుర్రాన్ని బాడుగకు తీసుకున్నాడు. ఎలాగూ గుర్రం ఎక్కి పోతున్నాను గదా, మామూలు దుస్తులతో పోవటం దేనికని వాడు చాకలి దగ్గిర మంచి ఖరీదైన బట్టలు అద్దెకు తీసుకుని, అవి తొడుక్కుని, కుచ్చుతలపాగా చుట్టి, గుర్రం ఎక్కి బయలుదేరాడు.

అయితే అది రౌతు చెప్పినట్టు వినే గుర్రం కాదు. గుర్రపుస్వారీ అలవాటు లేని శంకరుడు ఆ గుర్రంతో నానా అగచాట్లూ పడి, అత్తవారి ఊరు చేరే సరికి చీకటి పడి చాలాసేపు అయింది. ఆ చీకట్లో వాడు అత్త వారింటికి పోతే వాడి గుర్రాన్నీ, దుస్తులనూ ఎవరు చూస్తారు? అందుచేత వాడు తెల్లవారిన దాకా ఊరి పొలిమేరలో ఎక్కడైనా గడిపి, బాగా తెల్లవారినాక అత్తవారింటికి పోదామనుకున్నాడు.

ఊరి బయట వాడికి ఒక సత్రం లాటిది కనబడింది. దాని వసారాలో ఒకడు చింపిగుడ్డలు కట్టుకుని కూర్చుని ఉన్నాడు. వాడు దిక్కూ, మొక్కూ లేని బిచ్చగాడు.

శంకరుడు వాడిని, "ఈ సత్రం యజమాని ఎవరు?" అని అడిగాడు.

"ఇంకెవరు? నేనే!" అన్నాడు బిచ్చగాడు.

జి. వేదకుమారి

"అలా అయితే ఈ రాత్రి నే నీ సత్రంలో ఉండవచ్చునా?" అన్నాడు శంకరుడు.

బిచ్చగాడు ఆలోచించి, "ఉండవచ్చు గాని, నువు నాకు ఊళ్ళో అన్నంముష్టి ఎత్తి తెచ్చిపెట్ట వలిసి ఉంటుంది. సత్రంలో వంట ఏర్పాటు లేదు. నీ కైనా తిండి కావాలి గద!" అన్నాడు.

"నాకు ముష్టి ఎత్తటం చేత కాదే?" అన్నాడు శంకరుడు.

"అదేమీ బ్రహ్మవిద్య కాదు. ఈ బట్ట లతో పోతే నీకు ఎవరూ ఎంగిలి మెతు కైనా వెయ్యరు. ఆ బట్టలు విప్పేసి, నా చింకి బట్టలు కట్టుకుని, ఇంటింటికీ పోయి, 'అమ్మా, సందా కవళం, తల్లీ!' అని కేకపెట్టు. వాళ్ళు వేసేది ఈ జోలెలో వేయించుకో. జోలె నిండినాక ఇక్కడికి తిరిగిరా. హాయిగా ఇద్దరమూ తిండి తిందాం. రాత్రి ఇక్కడ గడిపి, నీ బట్టలు నువు వేసుకుని, నీ గుర్రం నువు ఎక్కి, నీ దారిన నువుపో!" అన్నాడు బిచ్చగాడు.

శంకరుడు తన బట్టలు విప్పి బిచ్చ గాడి కిచ్చి భద్రంగా చూస్తూ ఉండమని, వాడి చింకి బట్టలు కట్టుకుని, జోలె భుజానికి తగిలించుకుని బయలుదేరాడు. రెండు మూడు ఇళ్ళ దగ్గిర, "అమ్మా, సందాకవళం వెయ్యి, తల్లీ!" అని అరిచిన మీదట, వాడికి అందులో సామర్థ్యం చిక్కింది. కొన్ని ఇళ్ళవాళ్ళు కవళాలు వేశారు, కొందరు లేదు పొమ్మ న్నారు. జోలె గబగబా నిండటం చూసి



వాడికి ఆశ్చర్యం వేసింది. అడుక్కు తినే వాళ్ళకు కడుపునిండా తిండి దొరుకుతుందని వాడికి తెలియదు.

ఈ ఉత్సాహంలో శంకరుడు తన అత్త వారింటి ముందుకే వచ్చి, "అమ్మా, సందాకవళం, తల్లీ!" అని పొలికేక పెట్టాడు.

ఈ కేక వినగానే వాడి అత్తగారికి, అది తన అల్లుడి గొంతులాగా ఉన్నదని పించింది. ఆమె లాంతరుతో బయటికి వచ్చి చూస్తే తన అల్లుడే!

"అయ్యయ్యో! ఇదేమిటి, నాయనా! ఈ బట్టలేమిటి? ఈ జోలె ఏమిటి? ముష్టెత్తుతున్నావేమిటి? ఏం జరిగింది?" అంటూ నానాహంగామా చేసింది. ఈ గొడవకు ఇంటిల్లిపాతీ బయటికి వచ్చి, ప్రశ్నల వర్షం కురిపిస్తూ శంకరుణ్ణి లోపలికి తీసుకుపోయారు.

శంకరుడికి దుఃఖం ఆగలేదు. వాడు అత్తవారింటికి ఎంత వైభవంగా పోదామనుకున్నాడో అంత అవమానకరంగా వెళ్ళాడు. అంత దుఃఖంలోనూ వాడికి ఏమని బొంకాలో స్ఫురించింది.

"ఏం చెప్పేది? నేను జరీసిల్కు బట్టలు వేసుకుని, కుచ్చుపాగా పెట్టుకుని, గుర్రం ఎక్కి బయలుదేరాను. దారిలో నన్ను దొంగలు దోచేసి, నా బట్టలూ, గుర్రమూ కాజేశారు. చీకటి అయిపోయింది. లేకపోతే దొంగలను ఆనవాలు పట్టి ఉందును. తెల్లవారగానే వాళ్ళను పట్టుకుని, నా వస్తువులు నేను సంపాదించుకోనూ?" అన్నాడు శంకరుడు.

అత్తవారు వాణ్ణి సమదాయించి, వాడికి స్నానం చేయించి, వేరే బట్టలు కట్టుకోవటానికి ఇచ్చి భోజనం పెట్టారు. అందరూ పడుకున్నాక శంకరుడు చల్లగా లేచి, సత్రం యజమానికి జరిగినది చెప్పకపోతే ఏమన్నా అనుకుంటాడని, అక్కడికి వెళ్ళాడు. అక్కడ బిచ్చగాడు గాని, శంకరుడి బట్టలుగాని, గుర్రంగాని లేవు. బిచ్చగాడు ఆ బట్టలూ, గుర్రమూ తీసుకుని ఎప్పుడో వెళ్ళిపోయాడు.





# అదృష్టదేవత

పూర్వం చీనాలోవి ఒక గ్రామంలో వాంగ్ అనే పేద రైతు ఉండేవాడు. ఊహ తెలిసే నాటికి అతనికి నా అన్నవారెవరూ లేరు; తండ్రి తాతల తాలూకు ఎకర మున్నర పొలం మాత్రం ఉన్నది. వాంగ్ అందులో వ్యవసాయం చేస్తూ, తన ఖర్చులకు పోగా కొంత మిగుల్చుతూ వచ్చాడు.

వాంగ్ పొలాన్ని అనుకుని కొంత బీడు ఉండేది. ఆ బీడు కొనుక్కుని, తన పొలంలో కలుపుకుని వ్యవసాయం సాగించాలని వాంగ్‌కు ఎంతో కోరికగా ఉండేది.

ఆ బీడు ఒక వ్యాపారిది. వ్యాపారి మంచి ఆస్తిపరుడు. అనేక మందికి అప్పులు ఇచ్చి, వారి ఆస్తులు రాబట్టుకుని ఆయన ధనవంతు డయాడు. ఆ బీడు కూడా అలా సంపాదించినదే.

ఒకనాడు వాంగ్ వ్యాపారిని కలును కుని ఆ బీడును తాను కొంటాననీ, దాని ఖరీదు చెప్పమనీ అడిగాడు. బీడు కోసం వాంగ్ తహతహ పడుతున్నాడనీ, అది వాంగ్ పొలంలో కలుస్తుందనీ, బీడును సుక్షేత్రంగా చేసుకునే శక్తి వాంగ్‌కు ఉన్న దనీ గమనించి వ్యాపారి బీడు ధర చాలా హెచ్చుగా చెప్పాడు.

కాని వాంగ్ దగ్గిర అంత డబ్బులేదు; వ్యాపారి అడిగిన దానిలో సగమే ఉన్నది. వ్యాపారి అది తీసుకుని, మిగిలిన దానికి వాంగ్ చేత ఋణ పత్రం రాయించు కున్నాడు. తనకు భూమి అమ్ముడయి నట్టు పత్రం రాసి ఇయ్యమని వాంగ్ అడిగాడు. బాకీ పూర్తిగా తీరగానే క్రయ పత్రం రాసి ఇస్తానని వ్యాపారి చెప్పాడు.

బీడు సంపాదించుకున్న ఆనందంతో వాంగ్ తన ఇంటికి వెళ్ళిపోయాడు.

చేబియ్యం లక్ష్మీనారాయణ

కొంత కాలం గడిచింది. తన నుంచి కొన్న బీడులో వాంగ్ ఎలా వ్యవసాయం చేస్తున్నాడో చూడటానికి వ్యాపారి ఆ బీడు కేసి వెళ్ళాడు. వాంగ్ నాగలితో బీడు దున్నుతూ ఉండటం వ్యాపారికి కన పడింది. ఆ బీడును వ్యాపారి గుర్తించ లేక పోయాడు. అది పూర్తిగా మారి పోయింది.

వ్యాపారి చూస్తూండగానే నాగలికి ఏదో అడ్డు తగిలి ఆగిపోయింది. వాంగ్ దున్నటం ఆపి, పారతో తవ్వసాగాడు. వ్యాపారి గబగబా అక్కడికి వెళ్ళాడు. వాంగ్ తాను తవ్విన గుంట నుంచి రెండు బంగారు కూజాలు పైకి తీశాడు. అవి చాలా పాతకాలం నాటివి. అదృష్టదేవత ఎవరికైనా సహాయం చేయదలచుకుంటే బంగారు కూజాల రూపంలో వారిని చేరు కుంటుందని చీనాలో ఆ కాలంలో ఒక నమ్మకం ఉండేది. ఈ మాట వాంగ్‌కు తెలీదు గాని వ్యాపారికి తెలుసు. అందు చేత ఆయన ఆ కూజాలు తనవే నన్నాడు. కాని అందుకు వాంగ్ సమ్మతించక పోయే సరికి, ఇద్దరూ కలిసి న్యాయాధి కారి వద్దకు పోవలసి వచ్చింది.

తాను వ్యాపారి నుంచి బీడు కొని దున్నుతూ ఉండగా కూజాలు దొరికా యని వాంగ్ న్యాయాధికారికి విన్నవించు కున్నాడు.

వెంటనే వ్యాపారి న్యాయాధికారితో, "అయ్యా, వీడు మోసకారి. అసలు



ఆ బీడు భూమి నాదే. దాన్ని వీడికి నేను అమ్మనే లేదు. వీడి చేత బీడు దున్నిస్తూ ఉండగా ఇవి దొరికాయి. అదృష్టదేవత ఈ రూపంలో నన్ను చేరింది. వాంగ్ దురాశతో ఇవి తనవి అంటున్నాడు,'' అన్నాడు.

''అయ్యా, ఈ బీడు నేను కొనుక్కున్నాను,'' అన్నాడు వాంగ్.

''అందుకు రుజువు ఏమిటి?'' అని న్యాయాధికారి అడిగాడు.

వాంగ్ తెల్లబోయి, జరిగినదంతా వివరంగా న్యాయాధికారికి చెప్పాడు.

న్యాయాధికారికి వ్యాపారి దుర్బుద్ధి అర్థమయింది. కాని ఆయన పైకి, ''అదృష్టదేవత వ్యాపారిని వరించింది. అతని బీడులో దొరికిన కూజాలు అతనివే అవుతాయి,'' అంటూ, అందరూ వింటూండగా తీర్పు చెప్పి, కూజాలను వ్యాపారికి ఇచ్చాడు.

వ్యాపారి సంతోషంతో ఇంటికి పోయాడు.

వాంగ్ న్యాయాధికారితో, ''అయ్యా, కూజాలు పోతే పోయాయి. నా బీడు భూమి అయినా నాకు ఇప్పించండి,'' అన్నాడు.

''నువు ధైర్యంగా ఉండు. అంతా నీకు అనుకూలంగానే జరుగుతుంది,'' అని న్యాయాధికారి వాంగ్‌ను పంపేశాడు.

మర్నాడు ఉదయం న్యాయాధికారి కొంత మంది భటులను వెంటబెట్టుకు



పోయి, వ్యాపారిని పట్టుకున్నాడు. ఈ వార్త క్షణంలో గ్రామమంతా పాకి, అనేక మంది అక్కడ చేరారు.

న్యాయాధికారి వాళ్ళతో, "ప్రజలారా, ఈ వ్యాపారి నిన్న తన బీడులో ఈ కూజాలు దొరికినట్టు అబద్ధం ఆడాడు. నిజానికి ఇవి చక్రవర్తిగారి ఖజానాలోవి. నిన్న రాత్రి రాజుగారి చారులు నాకు ఈ వార్త అందజేశారు. కూజాలు తస్కరించిన వాణ్ణి బంధించమని చక్రవర్తిగారి ఆజ్ఞ. అందుచేత ఈ వ్యాపారిని బంధిస్తున్నాను. ఇతనికి దారుణమైన శిక్ష పడుతుందని నాకు తోస్తున్నది." అంటూ వ్యాపారి కేసి చూశాడు.

ఈ మాటలు వినగానే వ్యాపారికి గుండె ఆగినంత పని అయింది. అతను భయంతో వణికిపోతూ న్యాయాధికారితో, "అయ్యా, నిన్న బుద్ధి గడ్డి తిని తమతో అబద్ధం చెప్పాను. నేను ఏ పాపమూ ఎరగను. ఆ బీడుభూమి ఇప్పుడు నాది కూడా కాదు. దాన్ని వాంగ్‌కు ఎప్పుడో అమ్మేశాను. వాడే ఆ కూజాలను ఆ భూమిలో దాచి, నిన్న పైకి తీసినట్టున్నాడు. వాంగ్‌నే శిక్షించండి," అన్నాడు.

"అందుకు రుజువు ఏమిటి?" అని న్యాయాధికారి వ్యాపారిని అడిగాడు.

వెంటనే వ్యాపారి తనకు వాంగ్ రాసి ఇచ్చిన రుణపత్రాన్ని తెచ్చి చూపాడు.

అందుకోసమే వేచి ఉన్న న్యాయాధికారి ఆ పత్రాన్ని వాంగ్‌కు ఇప్పించి, లోపలి నుంచి కూజాలు తెప్పించి, "ప్రజలారా, ఈ వ్యాపారి వాంగ్ అమాయకత్వాన్ని ఆసరా చేసుకుని అతన్ని మోసం చెయ్యదలచాడు. కాని అతని మాటలను విశ్వసించలేక నేను ఈ నాటకం ఆడాను. ఈ కూజాలు చక్రవర్తిగారివి కానేకావు. వాటికోసం చక్రవర్తిగారు వెతికిస్తున్నారన్నది కూడా అబద్ధమే. న్యాయంగా ఈ కూజాలు వాంగ్‌కు చెందుతాయి. అదృష్టదేవత వరించింది వాంగ్‌ను!" అంటూ ఆ కూజాలను వాంగ్‌కు ఇచ్చేశాడు.





# సామ్యాసారం

దేవరపల్లె అనే గ్రామంలో గంగన్న అనే రైతు ఉండేవాడు. అతనికి వ్యవసాయం కలిసిరాలేదు. అందుచేత అతను సంతలో నాలుగు ఆవులూ, నాలుగు గేదెలూ కొని, పాలవ్యాపారం ప్రారంభించాడు. బ్రతికి చెడ్డవాడు గదా అని, చాలామంది గ్రామస్థులు అతని వద్ద పాలు కొంటూ వచ్చారు. ఆ ఊరి వైద్యుడు సోమేశ్వరశాస్త్రి కూడా గంగన్న వద్దనే పాలు పోయించుకునేవాడు.

గంగన్న కష్టాలు గట్టెక్కాయి. పాల వ్యాపారం అతనికి బాగా కలిసి వచ్చింది. అయితే అతనికి రాను రాను డబ్బు మీది ఆశ ఎక్కువ అయింది. అందుచేత అతను పాలలో నీరుకలిపి అమ్మసాగాడు.

ఒకసారి సోమేశ్వరశాస్త్రి గంగన్నతో, "ఈమధ్య పాలు పలచగా ఉంటున్నాయి." అన్నాడు.

"ఎండలు కదా, బాబూ? గొడ్లకు మేత లేక, అవి నీళ్ళుతాగి బతుకుతున్నాయి. అందుకే పాలు కొంచెం పలచబడ్డాయి." అన్నాడు గంగన్న.

గంగన్న అబద్ధమాడుతున్నాడని సోమేశ్వరశాస్త్రి గ్రహించి, చేసేది ఏమీ లేక ఊరుకున్నాడు.

ఇలా ఉండగా వర్షాకాలం వచ్చింది. గంగన్న గేదెలు కృశించి పోసాగాయి.

ఆ గ్రామంలో మనుషులకూ, పాడి పశువులకూ కూడా వైద్యం చేసేది సోమేశ్వరశాస్త్రే. అందుచేత గంగన్న శాస్త్రి వద్దకు వచ్చి, తన గేదెలు ఎండిపోతున్నాయని చెప్పి, మందు అడిగాడు.

గంగన్నకు బుద్ధి చెప్పటానికి శాస్త్రికి మంచి అవకాశం దొరికింది. ఆయన ఒక సీసాలో ఏదో పచ్చని ద్రవం పోసి ఇచ్చి, "గంగన్నా, ఈ మందు ఉదయం పూట

ఎ. ఖాదర్ వల్లీఖాన్

కుడితిలో కలిపి నీ గేదెలకు ఇయ్యి.'' అని, మందు ఖరీదు కింద రెండు రూకలు తీసుకున్నాడు.

రోజూ రెండేసి రూకలు చెల్లించి మందు తీసుకుని గంగన్న తన గేదెలకు పెట్టుతూ వచ్చాడు. కాని గేదెలు కృశించటం మానలేదు. ఒకరోజు గంగన్న శాస్త్రితో, ''రోజూ రెండేసి రూకలు ఖర్చవుతున్నదే గాని, మీ మందు ఏమీ పని చెయ్యటం లేదు.'' అన్నాడు.

శాస్త్రి తాపీగా, ''వర్షాలు గదా! మూలికల్లో నీరు చేరి ఉంటుంది. అందుకే మందు పని చెయ్యటం లేదు," అన్నాడు.

ఈ మాట విని గంగన్నకు చాలా కోపం వచ్చింది. అతను గ్రామాధికారి వద్దకు వెళ్ళి, శాస్త్రి తన దగ్గిర డబ్బు కాజేసి, రంగునీళ్ళు మందని ఇచ్చినట్టు ఫిర్యాదు చేశాడు.

మందు పనిచెయ్యటం లేదంటే శాస్త్రి గంగన్నతో అన్నమాటలు విని గ్రామాధికారి ఆశ్చర్యపోయాడు.

గ్రామాధికారి శాస్త్రిని పిలిపించి, ''గంగన్నతో మీరు ఇలా ఇలా అన్నారట, నిజమేనా?'' అని అడిగాడు.

దానికి శాస్త్రి, ''ఎండాకాలంలో గేదెలు నీరు ఎక్కువగా తాగి నీళ్ళపాలు ఇచ్చినప్పుడు, వర్షాకాలంలో మొక్కలకు నీరు ఎక్కువై, పసరు పలచబడి, మందు పని చెయ్యకపోవటం ఆశ్చర్యమా?'' అని గ్రామాధికారిని ఎదురు అడిగాడు.

గంగన్న పాలలో నీళ్ళు కలుపుతున్నాడని గ్రామాధికారి గ్రహించాడు. గంగన్నకు బుద్ధి చెప్పటానికే శాస్త్రి ఇలా చేశాడని కూడా స్పష్టమయింది.

అక్కడ ఉన్నవారంతా గంగన్న పాలలో నీళ్లు కలుపుతున్నాడని గ్రామాధికారితో అన్నారు. గంగన్న తన తప్పు ఒప్పుకుని, ఈసారికి క్షమించమనీ, ఇక ఎన్నడూ అలా చేయననీ అన్నాడు.

తరవాత శాస్త్రి గంగన్న గేదెలకు సరి అయిన వైద్యం చేసి, వాటిని బాగు చేశాడు.






తరవాత ధర్మరాజు విందుభోజనాలతో ఋషులను తృప్తిపరచి, కృష్ణుడి తరఫున గొప్ప దానాలు చేశాడు; పరీక్షిత్తును కృపుడికి శిష్యుడుగా ఇచ్చేశాడు; తన మంత్రులను పిలిచి తాను మహాప్రస్థానం చెయ్యబోతున్నట్టు చెప్పాడు; వాళ్ళు అభ్యంతరాలు చెబితే, వారిని ఎలాగో ఒప్పించాడు.

తరవాత పంచపాండవులూ ద్రౌపదీ తమ అభరణాలన్నీ తీసేసి, నారబట్టలు ధరించారు; తమ అగ్నులన్నిటినీ నీట గలిపి, బయలుదేరారు. ఆ స్థితిలో వాళ్ళను చూస్తూ ఉంటే, జూదంలో ఓడి వారు వనవాసం బయలుదేరటం గుర్తుకు వచ్చి, పౌరస్త్రీలు దుఃఖించారు. కాని పాండవులు మాత్రం ఏ మాత్రమూ చింతించలేదు.

వాళ్లు నగరం దాటి పోతూంటే కుక్క ఒకటి వారి వెంట బయలుదేరింది. కుక్కతో సహా ఏడుగురూ మహాప్రస్థానం బయలుదేరారు. వాళ్ళ ఉద్దేశాన్ని మార్చే ఉద్దేశంతో కొందరు పౌరులు వారి వెంట కొంతదూరం వెళ్ళి, వెనక్కు తిరిగారు. ద్రౌపదితో సహా పాండవులు వెళ్ళిపోయే సరికి ఉలూపి గంగానదిలోకి, చిత్రాంగద మణిపురానికి వెళ్ళిపోయారు. పాండవుల మిగిలిన భార్యలు పరీక్షిత్తు వెంట ఉండి పోయారు.

ముందుగా పాండవులు తూర్పు దిక్కుగా, ఒకరి వెనక ఒకరు నడుస్తూ,

66. స్వర్గారోహణ



ప్రయాణించారు. వాళ్ళు అనేక దేశాలూ, నదులూ దాటి కాలక్రమాన లౌహిత్యం అనే సముద్రాన్ని చేరారు.

అర్జునుడు యీ మహాప్రస్థానంలో ఇంకా తన గాండీవాన్నీ, అక్షయతూణీ రాలనూ తన వెంటనే ఉంచుకుని ఉన్నాడు.

వారి దారిలో అగ్నిదేవుడు కొండలాటి శరీరంతో ఎదురు తగిలి, ''పాండవులారా, నేను అగ్నిదేవుణ్ణి. అర్జునుడికి ఇక గాండీవంతో పనిలేదు. దాన్ని అతను వదలిపెట్టాలి. ఇది వరుణుడిది. దీన్ని వరుణుడికి తిరిగి ఇచ్చెయ్యాలి,'' అన్నాడు.

అర్జునుడు మిగిలిన వాళ్ళు చెప్పిన మీదట తన గాండీవాన్నీ, అక్షయతూణీ రాలనూ సముద్రంలో పడేశాడు.

తరవాత పాండవులు దక్షిణంగా తిరిగి, సముద్ర తీరం వెంబడి నైరృతీ దిశగా నడిచి, పడమరకు తిరిగారు. సముద్రంలో మునిగిన ద్వారక వారికి కానవచ్చింది. అక్కడి నుంచి వారు ఉత్తరంగా నడిచారు. వారికి హిమాలయాలు తగిలాయి; వాటిని దాటి వెళ్ళగా వారికి మేరు పర్వతం కనిపించింది.

ఇలా వారు నడుస్తూ ఉండగా, దారిలో ద్రౌపది చచ్చిపడిపోయింది. భీముడు ఆ సంగతి ధర్మరాజుకు చెప్పేసరికి, ధర్మరాజు వెనక్కు తిరిగి అయినా చూడకుండా ముందుకు సాగాడు.

తరవాత కొంతసేపటికి సహదేవుడు పడిపోయాడు. ఇలా వరసగా నకులుడూ, అర్జునుడూ కూడా పడిపోయిన సంగతి భీముడు ధర్మరాజుకు తెలిపాడు. తరవాత భీముడు కూడా తాను పడిపోతున్నానని చెప్పి, పడిపోయాడు. ధర్మరాజు మాత్రం వెనక్కు తిరిగి చూడకుండా ముందుకు సాగాడు. కుక్క మాత్రం ధర్మరాజు వెనకగా నడుస్తూనే ఉన్నది.

కొంతసేపటికి పెద్ద మోతతో ఇంద్రుడు తన రథంలో వచ్చి, ధర్మరాజును

ఆ రథంలో ఎక్కమన్నాడు. ధర్మరాజు ఇంద్రుడితో, "నా తమ్ములంతా చని పోయారు గదా! వారు కూడా నాతో రావాలి. ద్రౌపది కూడా మా వెంట ఉండాలి. ఇందుకు సమ్మతించు. వాళ్లు లేకుండా నేను స్వర్గానికి పోగోరను," అన్నాడు.

దానికి ఇంద్రుడు, "వాళ్ళందరూ తమ శరీరాలను వదిలిపెట్టి ఇదివరకే స్వర్గానికి చేరారు. నీకు బొందితో స్వర్గం లభిస్తున్నది," అన్నాడు.

"అయితే, ఈ కుక్క ఎంతో విశ్వాసంతో నా వెంట వస్తున్నది. దాన్ని కూడా స్వర్గానికి తీసుకు పోవాలి," అన్నాడు ధర్మరాజు.

"నా అంత వాడివై స్వర్గానికి పోతున్న నీకు ఇంకా ఈ కుక్కతో ఏం పని? దీన్ని విడిచిపెట్టు," అన్నాడు ఇంద్రుడు.

ధర్మరాజు అందుకు ఒప్పుకోలేదు. కుక్కలకు స్వర్గంలో చోటు లేదని ఇంద్రుడు ఎన్నివిధాలుగా చెప్పినా ఆయన వినిపించుకోలేదు.

అప్పుడు కుక్క రూపంలో ఉన్న యముడు ధర్మరాజు ముందు ప్రత్యక్షమై, "నిన్ను వనవాసమప్పుడు యక్షుడి రూపంలో ఒకసారి పరీక్షించాను. ఇప్పుడు మళ్ళీ కుక్క రూపంలో పరీక్షించాను. నీతో సమానుడు స్వర్గంలో కూడా లేదు. శరీరంతో నువు ఉత్తమ లోకాలకు పోగలవు," అన్నాడు.





ఇంద్రుడూ, యముడూ, మరుత్తులూ, అశ్వనీదేవతలూ, ఇతర దేవతలూ ధర్మ రాజును రథంలో కూర్చోబెట్టి, తమ విమానాలలో ఆయన వెంట బయలు దేరారు.

"ఎందరో రాజర్షులు ఉత్తమ లోకా లకు వచ్చారు గాని, బొందితో ఇలా వస్తున్న ధర్మరాజుకు ఎవరూ సాటి కారు," అని నారదుడు అన్నాడు.

"సుఖమైనా, దుఃఖమైనా నా తమ్ములు లేని స్థానం నాకు అవసరం లేదు," అన్నాడు ధర్మరాజు.

ఇంద్రుడు ఆయనతో, "రాజా, ఉత్తమ లోకాలకు పోతున్నా నువు మానవ సంబంధాలను విడిచిపెట్ట వేమిటి? నీ తమ్ములు ఉత్తమలోకాలకు పోలేదు. ఈ స్వర్గాన్నీ, దేవతలనూ, సిద్ధులనూ, దేవఋషులనూ చూడు!" అన్నాడు.

"నా తమ్ములను విడిచి ఉండలేను. వాళ్ళూ, ద్రౌపదీ, మా కొడుకులూ ఎక్కడ ఉంటే నేను అక్కడికే పోతాను," అన్నాడు ధర్మరాజు.

స్వర్గానికి చేరుకున్న ధర్మరాజు అక్కడ ఉత్తమాసనం మీద కూర్చుని, దేవతల మధ్య వెలిగిపోతున్న దుర్యోధ నుణ్ణి చూశాడు. ఆయనకు వెంటనే అసూయపుట్టి, అక్కడి నుంచి వెనక్కు తిరిగి, "లోభి అయిన ఈ దుర్యోధ నుడితో బాటు నాకు స్వర్గసుఖాలు వద్దు," అన్నాడు.

నారదుడు నవ్వి, "రాజా, స్వర్గంలో పాతపగలు విడిచిపెట్టాలి. ఈ దుర్యోధ నుడు వీరమరణం పొంది, స్వర్గం సాధించుకున్నాడు," అన్నాడు.

దానికి ధర్మరాజు, "సమస్త పాపా లకూ ఒడిగట్టిన ఈ దుర్యోధనుడికి స్వర్గం లభిస్తే, మహాపుణ్యాత్ములైన నా తమ్ములకు ఏ ఉత్తమ లోకాలు లభించాయో నేను తెలుసుకోవాలి. ధృష్టద్యుమ్నుడూ, అభిమన్యుడూ, ఉప పాండవులూ మొదలైనవారు ఎక్కడ

ఉన్నారో నేను చూడాలి,'' అని నారదుడితో అన్నాడు.

కర్ణుడూ, తన కోసం యుద్ధంలో ప్రాణా లర్పించిన రాజులూ స్వర్గంలో కనిపించక పోవటం చూసి ధర్మరాజు ఆశ్చర్య పోయాడు. ఆయన అలా అనటం విని, ''వారున్న చోటికే పద. నీ యిష్టప్రకారం జరపమని ఇంద్రుడు మాకు అజ్ఞ ఇచ్చాడు,'' అన్నారు దేవతలు. వాళ్ళు ఒక దూతను పిలిచి, ధర్మరాజుకు ఆయన కోరిన వారందరినీ చూపమన్నారు. ఆ దూత ధర్మరాజుతో, భీముడు మొద లైన వారున్న చోటికి బయలుదేరాడు.

వాళ్ళు వెళ్ళే దారిలో పాపులున్నారు. మార్గం నడవడానికి ఏమీ సుఖంగాలేదు. దారినిండా నెత్తురూ, మాంసమూ ఉన్నాయి. ఈగలూ, దోమలూ ముసురు తున్నాయి. ఎటు చూసినా జుట్టూ, ఎము కలూ, క్రిమికీటకాలూ, మంటలూ ఉండి భయంకరంగా కనబడుతున్నాయి. దారిలో సెగలు కక్కుతున్న వేడినీరు గల నది కనిపించింది.

ధర్మరాజు తన ముందు నడిచే దేవ దూతతో, ''ఇలా మనం ఇంకా ఎంత దూరం వెళ్ళాలి?'' అన్నాడు.

''నీకు శ్రమగా ఉన్నట్టున్నది. తిరిగి పోదాం. ఇక ముందు నడవ దగిన దారి కూడా లేదు,'' అన్నాడు దేవదూత.

ధర్మరాజుకు నిరాశతో బాటు, దుర్గంధం మూలంగా తల తిరిగిపోయింది.





స్వర్గసుఖాలు అనుభవిస్తున్నాడు? ఇదంతా ఏమిటి? నేను నిద్రపోతున్నానా? మేలుకుని ఉన్నానా? నాకు పిచ్చిగాని పట్టిందా?'' అని రకరకాలుగా బాధపడ్డాడు. ఆయనకు దేవతల మీదా ధర్మం మీదా అమితమైన కోపం వచ్చి తిట్టి పోశాడు. తరవాత ఆయన దేవదూత కేసి తిరిగి, ''నువు ఎవరి దూతవో వారి దగ్గిరికిపో. నేను వారి వద్దకు రానని చెప్పు. నేను నా సోదరులను విడిచి రాను. నా రాకతో వాళ్ళు కాస్త సుఖపడుతున్నారు,'' అన్నాడు.

దేవదూత ఇంద్రుడి వద్దకు తిరిగి వెళ్ళి జరిగిన సంగతి చెప్పాడు.

ఇంతలో కొన్ని గొంతులు దీనంగా, ''ధర్మరాజా, నువు రావటం వల్ల మాకు కాస్త సుఖంగా ఉన్నది. రెండు ఘడియలు ఆగు,'' అనటం వినిపించింది.

''మీరంతా ఎవరు?, ఎందుకిక్కడ ఉన్నారు?'' అని ధర్మరాజు ఆ కంఠాలను అడిగాడు.

''నేను కర్ణుణ్ణి! నేను భీముణ్ణి! నేను అర్జునుణ్ణి! నేను నకులుణ్ణి! నేను సహదేవుణ్ణి! నేను ద్రౌపదిని!'' అని ఆ గొంతులు సమాధానమిచ్చాయి.

ఇది విని ధర్మరాజు తనలో, ''ఈ పుణ్యాత్ములంతా ఏ పాపాలు చేశారు? ఏ పుణ్యం చేసి దుర్యోధనుడు

ధర్మరాజు రెండు ఘడియలపాటు అక్కడే ఉండి పోయాడు. ఇంతలో ఇంద్రుడు మొదలైన దేవతలు అక్కడికి వచ్చారు. వారు రాగానే అక్కడి చీకటి అంతా పోయింది. పాపుల ఆక్రందనలు పోయాయి. వైతరణి అదృశ్యమయింది. సుఖమైన వాయువులు వీచి, సువాసనలు వచ్చాయి.

ఇంద్రుడు ధర్మరాజుతో, ''ధర్మరాజా, నీ ప్రవర్తనను దేవతలు మెచ్చారు. ఇక చాలు, వచ్చెయ్యి. నువు సిద్ధి పొందావు. నీకూ, నీ తమ్ములకూ ఉత్తమ లోకాలు కలుగుతున్నాయి. కోప్పడవద్దు.

రాజైనవాడు నరకం చూడక తప్పదు. ప్రతి వ్యక్తీ తాను చేసిన పుణ్యపాపాలలో ముందు పుణ్యం అనుభవిస్తే తరవాత పాపం అనుభవించక తప్పదు. అలాగే ముందు పాపం అనుభవించిన వాడు తరవాత పుణ్యం ఫలితం పొందుతాడు. తక్కువ పాపం చేసినవాడు ముందుగా నరకం అనుభవిస్తాడు. అందుకే నిన్ను ముందు నరకానికి పంపాను. నీ తమ్ములూ, ద్రౌపదీ కూడా తాము చేసుకున్న కొద్ది పాపానికి నరకం అనుభవించారు. వారికి పాపవిముక్తి కలిగింది. ఇప్పుడు నీ వారంతా స్వర్గంలో ఉంటారు. వచ్చి చూడు. నీవు కర్ణుణ్ణి గురించి కూడా ఆదుర్దాపడుతున్నావు. అతనికి కూడా స్వర్గప్రాప్తి కలిగింది. నువు రాజులు సంపాదించే కన్న ఎక్కువ పుణ్యం సంపాదించావు. హరిశ్చంద్రుడూ, మాంధాతా, భగీరథుడూ, దుష్యంతుడి కొడుకైన భరతుడూ పొందిన స్థానాలు నీకు లభిస్తున్నాయి. ఇదుగో ఆకాశగంగ. ఇందులో స్నానం చేశావంటే నీ మానవ భావాలన్నీ పోతాయి,'' అన్నాడు.

ధర్మరాజు ఆకాశగంగలో తన మానవ శరీరాన్ని విడిచిపెట్టి, తిన్నగా తనవారున్న చోటికి వెళ్ళాడు. అక్కడ ఆయనకు కృష్ణుడు కనిపించాడు. అతను ఇప్పుడు కూడా గుర్తించదగిన రూపంలోనే ఉన్నాడు. అర్జునుడు కృష్ణుడి వెంటనే ఉన్నాడు. ధర్మరాజును చూసి వాళ్ళు గౌరవంగా ఆయనను సమీపించారు.

ఇంకొకచోట ఆదిత్యులలాగా ప్రకాశిస్తూ కర్ణుడు కనిపించాడు. భీముడు పూర్వపు రూపంలోనే మరుద్గణాల మధ్య కానవచ్చాడు. అలాగే నకుల సహదేవులు అశ్వనీదేవతల స్థానంలో కనిపించారు.

ఇంద్రుడు ధర్మరాజుకు ద్రౌపదినీ, ఆమె కొడుకులనూ, ధృతరాష్ట్రుణ్ణీ, అభిమన్యుణ్ణీ, పాండురాజునూ, కుంతీమాద్రులనూ, భీష్మద్రోణులనూ, ఇతర యోధులనూ చూపించి, వారిని గురించి వివరాలుచెప్పాడు. —(అయిపోయింది)






లక్ష్మీవంతో న జానంతి
ప్రాయేణ పరవేదనాం;
శేషే ధరాభర క్లాంతే
శేతే నారాయణః సుఖం. 1

[ఐశ్వర్యవంతులు తరచుగా ఇతరుల బాధలను తెలుసుకోరు. భూభారం మోసే శేషుడి తల్పం మీద నారాయణుడు సుఖంగా పడుకుంటాడు.]

ప్రాప్యచలా నధికారాన్
శత్రుషు, మిత్రేషు, బంధువర్గేషు
నాపకృతం, నోపకృతం, న
సత్కృతం, కిం కృతం తేన ? 2

[అస్థిరమైన అధికారాలు సంపాదించి, శత్రువులకు అపకారమూ, మిత్రులకు ఉపకారమూ, బంధువులకు సత్కారమూ చేయనివాడు ఏం చేసినట్టు ?]

అప్రకటీకృతశక్తిః శక్తోపి
జన స్తిరస్క్రియాం లభతే;
నివస న్నంతర్దారుణి లంఘ్యో
వహ్ని ర్నతు జ్వలితః. 3

[తన శక్తిని చూపనివాడు శక్తిమంతుడైనా అవమానం పొందుతాడు. కర్రలోని నిప్పు మండనంత కాలమూ దాన్ని ఎవరూ లక్ష్యపెట్టరు.]

---

గొప్పవాళ్ళ పెడవారులు

Photo by S. B. Takalkar



బహుమతి
పొందిన వ్యాఖ్య

గూట పిట్టేదిరా ?

పంపినవారు :
జంధ్యాల వెంకటరమణ

Photo by Prabhakar Mahadik



రవీంద్రనగర్,
గుంటూరు-4

కూడు తినబోయెరా!

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు



★



★ వ్యాఖ్యలు సెప్టెంబర్ 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైనమాత్రమే రాయాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
పెంపుడు కంగారు

మూడవ అట్ట:
పెంపుడు జింక

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-600026. Controlling Editor: 'CHAKRAPANI'

RAAS/B/166

Give her
**self-confidence**

Give her a
Savings Bank
Pass Book
of
**Bank of India**

Let her watch
her savings grow



**Children of 12 years and over can themselves operate their Savings Bank Accounts.**

# NP క్రాకీస్ చెక్కు పోటీ

## ఫలితము

| బహుమతి | చెక్కు నంబరు | కచ్చితమయిన చెక్కు మొత్తము |
|---|---|---|
| I | 508183 | రు. 1,897.00 |
| II | 508184 | రు. 1,095.00 |
| III | 508185 | రు. 973.00 |
| IV | 508186 | రు. 697.00 |
| V | 508187 | రు. 460.00 |

## విజేతలకు అభినందనలు :

### I బహుమతి

మిస్టర్ బి. కృష్ణన్‌కుమార్
C/o. మిస్టర్ కె. సి. కృష్ణన్, వెస్ట్ పార్క్ స్ట్రీట్
వెంకటపురం, అంబత్తూర్, మదరాసు - 53

### II బహుమతి

మిస్టర్ బి. వి. నరేష్
29, బెన్సన్ రోడ్, బెంగళూరు - 560046

### III బహుమతి (చెక్కు మొత్తము పంచబడినది)

1. మిస్టర్ బొడ్డు సుబ్బారావు
సీనియర్ స్టెనోగ్రాఫర్
(ఆఫీస్) జోనల్ ఇంజనీర్ (సివిల్)
భారత్ హెవీ ఎలెక్ట్రికల్స్ లిమిటెడ్
హైదరాబాద్ - 32

2. మిస్. డి. సుమతి
C/o. మిస్టర్ ఎ. ఆర్: పాండురంగం
నం. 3-2-224, ఖలాసీగుడ
సికింద్రాబాద్ - 3

### IV బహుమతి (చెక్కు మొత్తము పంచబడినది)

1. మాస్టర్ ప్రవీణ్‌కుమార్ అగర్వాల్
327, ఇబ్రహీం మండి
కర్నాల్ (హర్యానా) - 132001

2. మిస్. టి. విజయలక్ష్మి
C/o. టి. గోపీచంద్
B-4-3, III క్రాస్ రోడ్
ఐ. ఐ. టి., మద్రాసు - 36

### V బహుమతి

మిస్టర్ మధుసూదన్ బి. రాయ్‌చుర
C/o. పరివార్ జనరల్ స్టోర్, షాప్ నం. 3-6-751/1
హిమయత్‌నగర్, హైదరాబాద్ - 500029

మీ ప్రియమైన NP 007 బబుల్ గమ్ తెలుపు ముక్కలతో వహా మరల ఉచితముగా దొరుకుతున్నది
మీ అదృష్టం ఎలా వుంటుందో - ప్రయత్నించండి !

*Photo by:* **ANANT DESAI**



IN A PUBLIC ZOO IN INDIA

